# ఉత్తరాలు

## ముఖచిత్రం

శ్రీమతి ఇందిరా గాంధీగారి ముఖ చిత్రం (మీ) మా పత్రికకు ఎంతో వన్నె తెచ్చింది. మీరు 29వ పేజీలో వుడివినట్లు ఆమెను దేశమంత ప్రేమగా, దేశాన్ని తన కూతురంత ప్రేమగా పెంచిన నెహ్రూగారు లేరు. ఈ పదం గుండెల్లో వున్న బాధనంతా బయటకు లాగింది. శ్రీమతి ఇందిరా గాంధి గారి వ్యక్తిత్వం మబ్బుచాటు సూర్యుని లాంటిది. అడ్డంకులు లేకుండా వుంటే తన వైపు తేరిపార చూడటానిక్కూడా అవకాశం ఇవ్వడు సూర్యుడు. అవకాశం వుంటే విమర్శించటానికి వీలు లేనట్లు కర్తవ్యం నెరవేర్చగలరని ఇందిర విషయంలో మేము అనుకొంటున్నాం. ఆ అవకాశం ఇప్పుడు వచ్చిందిగా !

వంకాయల నాగమణి (విజయవాడ)

* * *

భారత దేశానికి ముద్దుల పట్టి ఇందిరా గాంధీ ముఖచిత్రం పత్రిక మీద చూడగానే చాలా సంతోషము కలిగింది. ఈ వారం సంచిక కూడా కొత్త శీర్షికలతో చాలా ఆకర్షణీయంగా వుంది. కథల్లో 'ఎదురు చూసిన వసంతం' — ముగింపు, ముఖ చిత్రంలాగే ఎవ్వరూ వూహించనంత గొప్పగా వుంది. బ్రిటిష్ యువతి యథార్థగాథ చదువుతూన్నంతసేపూ హృదయం ద్రవీ భూత మయింది.

లోడగల పద్మావతి (వాల్తేరు)

* * *

ఈ వారం మీ పత్రిక అట్టమీద బొమ్మ చూసి గబుక్కున ఏదో ఇంగ్లీషు పత్రిక అనుకొన్నాను. ఇందిరా గాంధీ గారి చిత్రము చాలా బాగుంది. రంగులు బాగుగా కుదిరినవి. కాని ఆమె తలమీద తెల్ల వెంట్రుకలు సరిగా పడలేదు. ఇక మీదట ఇటువంటి వాటికి ప్రాముఖ్యత ఇస్తే బాగుంటుంది. అట్టమీద బొమ్మ చూసి గర్విస్తూ, మా స్త్రీ లోకం తరఫున మీకు నా ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

అన్నే. కృష్ణ కుమారి (వరంగల్)

* * *

ఈ వారం పత్రిక ముఖచిత్రం "ఇందిరా గాంధీ" మమ్మల్ని ఎంతో ఆకర్షించినది. సీరియల్ కథలు కూడా చాలా బాగున్నవి. మొత్తానికి పత్రిక క్రొత్త క్రొత్త శీర్షికలతో, నూతన పోకడలతో చాలా ఆనందం కలుగ జేస్తున్నది. ఇకముందు కూడా ఇలాగే సర్వాంగ సుందరముగా వెలువడాలని ఆశిస్తున్నాము.

ఈ వారం "జన్మదిన ఫలం" శీర్షికలో ఆగష్టు — 10కి బదులు జూలై — 10 అని పడింది. ఇది అచ్చు పొరపాటు అనుకుంటాను.

ఎ. సత్యవతి ( యడ్లపల్లి )

* అది అచ్చు పొరపాటే. మీ సూచనకు కృతజ్ఞులము.

## కథలు

"ఎదురు చూసిన వసంతం" నన్ను ఎంతో ఆకర్షించింది. ఎస్. రామసుబ్బారావు గారి కలము నుండి ఇంకా ఇటువంటి రచనలు రావాలని తలుస్తున్నాను. అందులో చదివిన కథనేను జీవితములో మరచి పోలేను. అందులో వ్రాసిన శ్రీధర్ పాత్ర నేను ఎప్పటికీ మరువలేను.

వెంకట్రావు (శ్రీ కొవ్వూరు)

* * *

"మనీత" చాలా చిన్న కథ అయినా కథకు పి. శ్రీధరరావుగారు చక్కగా వ్రాశారు. కథ వాస్తవమునకు చాలా దగ్గరగా వుంది. నేను ఈ కథను చదివినంతసేపూ, ఒక స్వప్నములా ఫీలయ్యాను. చదివిన వెంటనే పి. శ్రీధరరావుగారికి కృతజ్ఞత తెలుపుకొంటూ ఉన్నాను. మరి తెలుపుతారు గదా!

పాదరి ( శ్రీకాకుళం )★

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 21—8—'64
క్రోధినామ సం॥ శ్రావణ మాస శు॥ త్రయో॥
సంపుటము 56 సంచిక : 51

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలకు ఓడమీద ( Sea Mail ) రూ. 28.60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్ జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడిప్రతి 30 పై.
సంవత్సర చందా 15.60 పై.
6 మాసాల చందా 7.80 పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1




"మరీ అంత దిగాలుగా వున్నారేం? కొంపతీసి మీరు కూడా దొంగ నిల్వలేం చెయ్యలేదు కదా?"

## మనలో మాట

'నరకానికి ప్రయాణం' యీవారంతో ఐపోయింది. పాఠకులు యీ యదార్థగాథపట్ల చూపిన ఆసక్తిని ఊతగా తీసుకుని వెంటనే పైవారమే మరొక యదార్థ సాహసగాథను ప్రారంభిస్తున్నాము. ఆరువేలమైళ్లు సైకిల్‌మీద- ఒంటరిగా భారతదేశాన్ని చూడాలనే చిన్ననాటి కోరికతో- వచ్చిన డెర్వ్లా మర్ఫీ అనే యువతి తన సాహసమైన, అద్భుతమైన, అనుభవాలను అంతకంటే ఉత్కంఠతతో చెప్పిన ఉదంతం పైవారంనుంచీ చదువుతారు.

* * *

ప్రతీవారం యికమీదట ఏదో ఒక ప్రత్యేకత వుండేటట్లే వుంది. ఆగస్టు పదిహేను తర్వాత యించుమించు ప్రతిసంచికకు ఒక పండుగో అలాంటి విశేషమో వస్తూనే వుంటుంది. ఒక కొత్త విశేషం- ఒక ప్రత్యేకత- పాఠకులకు వారానికోసారి అందించే ప్రయత్నంలో 'స్థలాభావ'మనే 'అస్త్రప్రయోగం' కొన్ని సాధారణ శీర్షికలలో దేనిమీదో ఒకదానిమీద ప్రయోగించవల్సి రావడం తప్పనిసరి అవుతూవుంటుంది.

* * *

'దీపావళి కథలపోటీ' విషయంలో నిబంధనలను మా ప్రకటన విపులంగా పేర్కొన్నప్పటికీ, కొంతమంది సందేహాలు మాకు నిత్యమూ చేరుతూనేవున్నాయి. ఒకే కథను రెండు పత్రికలకు పంపడమే సబబు కానప్పుడు పోటీ విషయంలో అట్టి అవకాశాన్ని ఎలా ఊహిస్తారో మాకు తెలియదు! ఒకే రచయిత ఎన్ని కథలైనా పంపవచ్చునా? అనే ప్రశ్నకు కూడా సమాధానం యివ్వవల్సి వస్తుందనుకోలేదు. ఒక రచయిత ఒక బహుమతికి మాత్రమే అర్హుడు అని వేరే చెప్పనక్కర్లేదనుకున్నాము.

* * *

'వినాయకచవితి' ప్రత్యేక సంచిక ఎక్కువ పేజీలతో వెలువడుతుంది. ఎక్కువ హాస్యాన్నికూడా అందిస్తుంది. ఆ సంచికకు 21-8-'64 తర్వాత పంపే రచనలను స్వీకరించలేము గనుక ఇటుపై వారి రచనలను 'హాస్యసంచిక'కని పంపవద్దని రచయితలకు మరోసారి మనవి చేస్తున్నాము. ★

## విషయానుక్రమణిక

ముఖచిత్రం 'సంగమ్' లో వైజయంతిమాల.

శరీరానికి ఆహారం ఎంత అవసరమో, ఆత్మకి ప్రార్థన అంత అవసరం. ఒక్కోసారి శరీరారోగ్యం కోసం ఉపవాసం చేయవల్సిరావచ్చును. కానీ ఆత్మకి 'ప్రార్థన ఉపవాసం' అక్కరలేదు. అది సదా కావాలి !

—మహాత్మాగాంధీ.


కావల్సింది పెద్ద ఆపరేషనే
తిండి కొరతతో బాధ పడుతున్న ప్రజ
ఆందోళన ఉద్యమం


వియత్నాంపై అమెరికా చర్యను నిరసిస్తున్నాం
బహిరంగంగా


అంతే కావాలిలే వాళ్ళకి!
లోపాయికారీగా


నువేవ్ చెశావే యిది
నా చెయ్యి విరిగింది బ్రదర్!


కాంగ్రెస్‌లో వ్యక్తి ఆరాధన!
OOMM

# జాతీయమైన అంతర్జాతీయమైన క్లిష్టతర సమస్యలను దైనందిన జీవితంలో ఎదుర్కొంటున్న 36 వ అమెరికన్ అధ్యక్షుడు లిండన్ బి. జాన్సన్!



మధ్యాహ్న భోజనానికి ఇంటికి వెళుతున్నా, త్రోవలో తనను చూడ వచ్చిన దేశీయ, విదేశీయ ప్రజలను ఆప్యాయంగా పలకరించటం అధ్యక్షుడు జాన్సన్‌కు ఇష్టం. [ఆగస్టు 27 అతను పుట్టిన రోజు]



ఆఫీసునుంచి ఇంటికివచ్చినా బరువు బాధ్యతలు, అత్యవసరమైన టెలిఫోన్ సంప్రదింపులు అతనిని అనుసరించే వుంటాయి.

స్వదేశీ, విదేశీ రాజనీతిజ్ఞులతో సమాలోచనలు జరిపటం, ఒకానొక మహారాజుకు ఆతిథ్యాన్ని ఇచ్చి, వినోదాన్ని కలిగించటం, నిరాయుధీకరణ సలహాదారులతో ముచ్చటించటం, ఎక్కడో రైలు మార్గం సమీపంలో జరుగనున్న సమ్మెను నిలుపుదల చేయటానికి కృషి చేయటం, పేదరికంపై జరుగవలసిన యుద్ధానికి అవసరమైన పథకాన్ని రూపొందించుకోవటం, ఏడువేల ఐదువందల మైళ్ల దూరాన 'మనీలా' వున్న ప్రభుత్వ కార్యదర్శిని ఎప్పటికప్పుడు సంప్రదిస్తూ వుండటం ఇంకా ఇలాంటివి మరికొన్ని కలిపితేనే అమెరికా అధ్యక్షుడు లిండన్ జాన్సన్ గారి ఒకనాటి దినచర్య సమాప్తమవుతుంది. రోజుకు 18 గంటలపాటు ఆయన పని చేస్తూవుంటారు.

ఆ రోజు ఏప్రిల్ 14, మంగళవారం. శ్రీ జాన్సన్ పదవిలోకి వచ్చిన తరువాత, ఇంతకంటే ప్రధానమైన రోజులు — ఒక్క క్షణం కూడా తీరిక దొరకని రోజులు లేకపోలేదు. అయినా అవి బహుకొద్ది మాత్రమే. కాని ఏప్రిల్ 14 మంగళవారం మాత్రం ఒక ప్రత్యేకత సంతరించుకొన్నది. — దానికి కారణం, ఆనాటి కార్యక్రమాల్లోని వైవిధ్యం మాత్రమే.

ఉదయం ఆరుగంటల ప్రాంతంలో ఆయన నిద్ర లేస్తారు. అర్ధరాత్రి 12—30కు గాని, మళ్లీ విశ్రమించరు. ఈ మధ్య కాలంలో, దాదాపు ప్రతి నిముషమూ ఎంతో విలువైనది; ప్రతి క్షణమూ ఏదో పని చేస్తుంటారు., ఉదాహరణకు — ఆయన, ప్రారంభంలో ఐదు వేర్వేరు వర్గాలతో సమాలోచనలు జరిపారు. ఆదే రోజున జోర్డాన్ రాజు హుసేన్‌తో ముచ్చటించారు. ఇంతలో తనను చూడ వచ్చిన తొమ్మిది వుంది పెద్దలను, ఆయన కలిశారు. అంతలోనే 25 టెలిఫోను పిలుపులు! టెలిఫోనులోనే ఒకరితోనే దాదాపు అరగంటసేపు మాట్లాడటం కూడా అనివార్యమయి పోయింది వారికి! — కాఫీ ఫలహారాలను సేవించే సమయంలోనూ, భోజనం చేసే వేళనూ ఆయన దేశీయ వాణిజ్యం, వర్తకం గురించి చర్చలు జరుపుతూనే వున్నారు. ఆనాటి రాత్రి ప్రభుత్వ పక్షాన జరిగిన విందులో ఒక దానికి ఆధ్వర్యం వహించింది వారే. వీటన్నింటికి తోడు బాధ్యతాయుతమైన అధ్యక్ష పదవిని అంటిపెట్టుకొని వుండే బాధ్యతలను కూడా నిర్వహిస్తూనే వున్నారు.

## క్షణ క్షణమూ

శ్రీ లిండన్ జాన్సన్ దైనందిన కార్యక్రమాన్ని ఒక రోజు ఉదహరిస్తున్నాము : తేదీ ఏప్రిల్ 14 ;

ఉదయం 6—15 : నిద్ర లేవటం, కాఫీ పుచ్చుకోవటం, వెనువెంటనే ప్రభుత్వశాఖనుంచి వచ్చిన రెండు ముఖ్యమైన నివేదికలు చదవటం, ఐదు దినపత్రికలను చూడటం.

7—15 : 'మనీలా'లో వున్న ప్రభుత్వ కార్యదర్శి శ్రీ డీన్ రస్క్ పంపిన "సీటో" వ్యవస్థకు సంబంధించిన నివేదికను చదవటం, విదేశీ రాయబారుల నివేదికలను చదవటం, జరిగింది. వెంటనే సూపర్‌సానిక్ రవాణా విమానాల తయారీకి సంబంధించిన నివేదికను చదివారు. గత వారం జరిగిన సంఘటనల సారాంశాన్ని తెల్పుతూ వేర్వేరు మంత్రివర్గ సభ్యులు పంపిన నివేదికలను చదివి, తదుపరి ఆనాటి తమ కార్యక్రమాన్ని ఒక్కమారు పర్యావలోకనం చేసి కొన్నారు.

8—00 : పది నిమిషాలసేపు 'టెలివిజన్' మీద వార్తలను తెలిసికొన్నారు.

8—10 : ప్రభుత్వ అధికారులతో టెలిఫోను మీదనే మాట్లాడి తాజా వార్తలను తెలిసికొన్నారు.

8—45 : ప్రతి వారం వలే, ఆ రోజు కూడా ఆయన డెమోక్రాటిక్ పార్టీ నాయకులను కలిసి, వారితో వైట్ హౌస్‌లో— (భోజనాల గదిలోనే—) సమాలోచనలు జరుపుతూనే, కాఫీ ఫలహారాలు ముగించుకొన్నారు. ఆ సమాలోచనలో దేశీయ, అంతర్జాతీయ వ్యవహారాలకు సంబంధించిన అంశాలను ఎన్నింటినో ప్రస్తావించటం జరిగింది.

9—45 : తరువాత 'వైట్‌హౌస్' లోని తమ కార్యాలయానికి వచ్చి, అక్కడే సెనేటర్ మేన్స్‌ఫీల్డ్, సెనేటర్ హంఫ్రీ, రాజకీయ

ఈనెల నాలుగవ తేదీ రాత్రి ఉత్తర వియత్నాంమీద ప్రతీకార సైనికచర్య తీసుకోవలసినదని తన విమానాలకు ఉత్తరవు జారీ చేసిన ముప్ఫయి ఆరవ అమెరికా అధ్యక్షుడు శ్రీ లిండన్ బి. జాన్సన్ వెనుకటికి ఓసారి "మా ధైర్యాన్ని పరీక్షించాలనుకున్నవాళ్లు అది చాలా గట్టిదని (చవి) చూస్తారు. మా స్నేహం కోరేవాళ్లు అందులో నిజాయితీ వుందనీ చూస్తారు" అన్నాడట. ఆగ్నేయ ఆసియాలో అతిక్లిష్టమైన వాతావరణంవున్న యీ తరుణంలో శ్రీ జాన్సన్‌యొక్క యీ ప్రకటనకు ప్రపంచ రాజకీయరంగంలో ప్రాముఖ్యత చాలా ఎక్కువ!

**అమెరికన్ ముప్ఫయి ఐదవ అధ్యక్షుడయిన 'కెనెడీ మీద మనకు గల సానుభూతితోను అతని హత్యపట్ల విచారంతోనుగాక, అతని విధానాలు 'ఋజు' వైనవి గనుక వాటిని పురోగమింపచేద్దాము' అని ప్రకటించినవాడు కూడా శ్రీ లిండన్ జాన్సనే గనుక అతని రాజకీయ విజ్ఞతను, శీలాన్ని శంకించవలసిలేదు అని కూడా అంటారు విజ్ఞులు.**

**1908లో టెక్సాస్‌లో ఆగస్టు 27 న పుట్టిన శ్రీ లిండన్ బెయిన్స్ జాన్‌సన్ మనిషి ఆరడుగులకన్న పొడగరి-ఆశయాలు బాధ్యతలు కూడా అతనివి దేశీయ విదేశీయ రంగాలలో బహుముఖమైనవి— బహుక్లిష్టమైనవి అందుకు చాలిన సామర్థ్యం అతనికి యితరత్రా కూడా వుందనేందుకు యీ కొంచెం రోజుల పదవి నిర్వహణ ఋజువు పర్చిందని చెప్పవొచ్చు. అతని దైనందిన కార్యక్రమం తెలుపగల ఒక 'దినచర్య'ను యిక్కడ వేస్తున్నాము.**

ప్రముఖుడు కార్ల్ అల్‌బెర్ట్‌ను, తన ప్రాంత స్నేహితు లొకర్ని, టెక్సాస్ అటార్నీ జనరల్‌నూ, కలిశారు. సెక్రెటరీ డీన్‌రస్క్ 'సీటో' సమావేశాలపై పంపిన మరో నివేదికను ఆయన చదివారు. తరువాత తాము 'డైరీ'తో వ్రాసికొని సిద్ధంగా వుంచుకొన్న సమస్యలను ఆ వుద్యోగులతో ముచ్చటించారు.

10—10 : అమెరికా — నిరాయుధీకరణ అధికారి విలియం జి. ఫాస్టర్‌ను కలిసి ఆ అంశానికి సంబంధించిన సాధక బాధకాలను చర్చించారు. అనంతరం, ఆ రోజున న్యూయార్కులో చేయవలసిన ఉపన్యాసంలో ప్రస్తావించవలసిన సంగతులు ఒక్కమారు జ్ఞప్తికి తెచ్చుకొన్నారు.

10—40 : కొన్ని డాక్యుమెంట్లను చదివారు. వార్తలను చదివారు. ప్రభుత్వ ఆర్థిక వ్యవహారాలపై చర్చించేందుకు బడ్జెటు డైరెక్టరు కెర్మిట్ గోర్డాన్‌ను కలిశారు. సివిల్ సర్వీసుశాఖ అధ్యక్షులు జాన్. డబ్ల్యు. మేకీని కలిసి ఆ శాఖకు సంబంధించిన కొత్త మార్పులను గురించి ప్రస్తావించారు. మరికొంత సేపయాక మిస్సోరీ గవర్నర్ జాన్ డాల్టన్‌తో ఫోన్‌లో మాట్లాడి, కాన్సస్ నగరం వద్ద సంభవించిన తుఫాను భీభత్సపు బాధితుల సహాయార్థం జరగవలసిన కార్యక్రమాలను గురించి చెప్పారు. అర్విల్ ఫ్రీమన్‌తో టెలిఫోన్‌లో మాట్లాడి ఆహార వ్యవహారానికి సంబంధించిన ప్రగతిని గూర్చి చర్చించారు.

11—15 : ప్రభుత్వానికి చేదోడు వాదోడుగా నిలిచి, ప్రభుత్వ బహుమతులు పొందిన పదిమంది వుద్యోగులతో ఆయన మాట్లాడారు.

11—30 : సామీప్యపు తూర్పు దేశాల వ్యవహారాలను శ్రీ జాన్సన్, ప్రభుత్వ కార్యదర్శి శ్రీ బాల్‌తోను, విదేశాంగ వ్యవహారాల సలహాదారులతోను, చర్చించారు.

11—45 : హుస్సేన్ రాజుకు స్వాగతం ఇచ్చారు — యోగక్షేమాల విచారణ, రాయబారు లందరితో కలిసి ఫోటో తీయించుకోవటం — మొదలైన సంప్రదాయాలన్నీ కలిసి దాదాపు అరగంట పట్టాయి.

12—15 : తరువాత, మరి కొంతకాలం హుస్సేన్ రాజాతో వైట్‌హౌస్‌లోనూ, అతిథి గృహంలోనూ గడపవలసి వచ్చింది. మరోవైపు తన కోసం ఎదురు చూస్తున్న 'టూరిస్టు'లతో కొంతసేపు శ్రీ జాన్సన్ ముచ్చటించి, వారిలో పలువురికి తన 'ఆటోగ్రాఫ్'లను ఇచ్చారు.

1—30 : తమ 'వైట్‌హౌస్'లోని ప్రధాన వుద్యోగులతో మధ్యాహ్న భోజనం చేశారు. కొద్ది క్షణాలసేపు పెద్ద కుమార్తె లిండాతో మాట్లాడారు. ఆమె ఇంగ్లీషు పరీక్ష ఎలా వ్రాసిందీ తెలిసికొన్నారు.

3—00 : ఓ ముప్పావు గంటసేపు విశ్రమించారు.

3—45 : అనంతరం కార్మికశాఖ కార్యదర్శి డబ్ల్యు. విలియర్డ్ విర్ట్స్‌తో ఫోనులో మాట్లాడి రైల్వే కార్మికుల ప్రసక్తిని గూర్చి చర్చించారు.

4—15 : పలువురు ప్రభుత్వ కార్యదర్శులతోను, ఇతర ప్రధాన అధికారులతోను ఫోన్‌లో మాట్లాడి ప్రభుత్వ వ్యవహారాలు చర్చించారు. పత్రికా కార్యదర్శి శ్రీ రీడీతో మాట్లాడి, ఐర్లెండ్ అధ్యక్షుడు మే 27—29 వ వాషింగ్టన్ సందర్శించనున్న అంశాన్ని, విలేఖరుల సమావేశంలో వెల్లడి చేయమన్నారు. తదనంతరం, ప్రభుత్వ కాగితాలు కొన్నింటి మీద సంతకాలు చేశారు. అలాస్కా భూకంపపు బాధితులకు ఆర్థిక సహాయాన్ని మంజూరు చేశారు. తరువాత, ప్రభుత్వ రహస్య నివేదిక నొకదాన్ని చదివారు. హుస్సేన్ రాజుకు ఆతిథ్యం ఇచ్చే విషయాన్ని గురించి, ఆ ఏర్పాట్లకై శ్రీమతి జాన్సన్‌తో మాట్లాడారు.

5—45 : తన కార్యాలయానికి తిరిగి వచ్చి, ఆర్థిక సలహాదారుల సంఘ అధ్యక్షుడైన డాక్టర్. వాల్టర్ హెలెర్‌తో మాట్లాడారు.

6—00 : జమైకా రాయబారిగా పదవీ విరమణ చేయనున్న విలియం దో హెర్టీని ఆయన కలిశా ఆ రోజున, అక్కడే వైద్య చికిత్స పొందుతున్న జమైకా ప్రధాని సర్ అలెగ్జాండర్ బస్టమంటేకు టెలిఫోన్ చేసి వారి ఆరోగ్యం గురించి మాట్లాడారు.

6—15 : అమెరికా శాంతిదళ అధిపతి, పేదరికం నిర్మూలన శాఖ తాత్కాలిక డైరెక్టరు అయిన సార్జెంట్ ష్రివర్‌ను, ప్రముఖ పారిశ్రామిక వేత్త థామస్ నికోలస్‌ను కలిసి వివిధ విషయాలు చర్చించారు.

6—40 : ఉత్తరాలపై సంతకాలు చేశారు. ఉత్తరాలను 'డిక్టేట్' చేశారు. ఉద్యోగులను కలిసి మరుసటి రోజు కార్యక్రమం చర్చించారు.

7—30 : 'డిన్నర్' దుస్తులను ధరించారు.

7—50 : శ్రీమతితో కలిసి జోర్డాన్ రాజా హుస్సేన్ గౌరవార్థం ఇస్తున్న విందులో పాల్గొని, అనంతరం వినోద కార్యక్రమాలలో కొంతకాలం గడిపారు.

10—30 : వివిధ విషయాలకు సంబంధించిన నివేదికలను చదివారు. టెలివిజన్ వార్తలను ఆలకించారు. మరుసటి రోజు కార్యక్రమాలకు సంబంధించిన కాగితాలను సిద్ధం చేసికొన్నారు. అలా రెండు గంటలు గడిచాక, రాత్రి 12—30 కు విశ్రమించి, నిద్రకు ఉపక్రమించారు.

ఇదీ వారి బాధ్యతాయుతమైన దైనందిన కార్యక్రమానికి ఉదాహరణ. ★

సెనెటర్



'రిపబ్లికన్' బారీ మోరిస్ గోల్డ్ వాటర్ [55] ను లిండన్ జాన్సన్ రానున్న ఎన్నికలలో ఎదుర్కొనవల్సి వున్నది!

# తలనొప్పినుంచి త్వరితమైన నివారణ పొందండి




అనాసిన్ చాలా గుణకారి, ఎందుకనగా అది మందుల కూడిక—అచ్చంగా వైద్యుని ఔషధ యోగంవంటిది—శీఘ్రంగా సంపూర్ణ నివారణ గలిగిస్తుంది.

- అనాసిన్‌లో, శీఘ్రంగా నొప్పిని పోగొట్టే అధిక నొప్పినివారక ఔషధం గలదు.
- అనాసిన్, తలనొప్పిని కలిగించే సామాన్య కారణమైన నరముల బిగువును సడలించును.
- అనాసిన్, జ్వరమును తగ్గించును.
- అనాసిన్, తరచుగా నొప్పిని, జ్వరమును, అనుసరించే నీరసమును తొలగించును.

Registered Users: GEOFFREY MANNERS & CO. LTD.

2 బిళ్ళలు 13 న.పై. మాత్రమే

# అనాసిన్

చాలా మంచిది ఎందుకనగా అది 4 విధాల చర్యజరుపును

(...)

---

ఓం! తత్! సత్!

## సుఖ జీవిత సేవ

"సిద్ధ వైద్య మహిమ"

సిద్ధుల సాటిలేని కీర్తికి ఒక తార్కాణము

కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారి గారి



## 'మేల్ మాయిల్ మందు'

(Regd)

దీర్ఘకాల చర్మరోగములకు చక్కని నివారిణి

నల్లరంగు, ఎర్రరంగు పొడలు, దద్దులు, పొక్కులు, గజ్జి (చర్మ సంబంధము) పొడలు గల చోట్లలో తిమురులు, సూదితో పొడిచినప్పుడు నొప్పి లేకుండుట, నిప్పుపడి బొబ్బలు గలిగినా తెలియకుండుట, దుర్నీరు సర్వ అవయవములందు వ్యాపించి, రక్తములో కలిసి మత్తు కలుగజేయుట, (నరముల సంబంధము) చేతి వ్రేళ్ళు ముడుచుకొనుట, బొబ్బలు లేచుట, ముక్కు బంధనములు, పాదము నందు పల్లపు పుండ్లు ఏర్పడుట, కాలుచేతులు వ్రేళ్ళు తగ్గుట, ముక్కు సొట్టపడుట, చూచుటకు వినుగు పుట్టించు రణములు (అస్థి సంబంధము) వీటికి చక్కని నివారిణి.

1 మండలం (40 రోజులు) నూనె, లేహ్యము రు. 7-50 తపాల ఖర్చు రు. 2/-

8 ఔన్సుల శ్రీ పరమాత్మ తైలం రు. 3/- తపాల ఖర్చు రు. 1-50

సిద్ధ డాక్టర్

### కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారి & సన్సు

5/22, మేల్ మాయిల్ P.O., (N.A. Dt.)

---

## RATNAM'S N-OIL

(పై పూతకు మాత్రమే)

అంగనరములు బలహీనత చెంది, చిన్నదైనచో తిరిగి యథాప్రకారం ఆయుపూర్తి సౌఖ్య మనుభవించుటకు 50 సం॥ ప్రఖ్యాతి గలది. 1 సీసా రూ. 10/-లు వి. పి. 1-50. కావలసినవారు అడ్వాన్సు పంపేది. ఇందులో స్పెషల్ రకం అర్జంటు గుణమునకు రూ. 25-00లు వి. పి. రూ. 2-00.

డాక్టర్ రత్నం సన్స్, (Estd 1904)

మలకపేట బిల్డింగ్, ఆజంపూరా మార్కెట్‌వద్ద, హైదరాబాద్-24 (ఆంధ్రప్రదేశ్)

---

## పాదాలలో ఆనెలు

పాదాలలో ఆనెలు, కండలు పెరిగి, వ్రేళ్లు పాతుకుపోయి పాదము నేలపై పెట్టలేక రాళ్ళు తగిలిన త్రుళ్ళిపడువారు పై పూతగా వాడిన వ్రేళ్ళతో సహా మాయించేయగల సంజీవి. వెల పోస్టుఖర్చులతో రు. 4-25న.పై.

కొక్కోకము చిత్రపటములు గలది. రు. 1-50

దాంపత్య రహస్యములు ... రు. 3-00

తెలుగు హిందీ స్వయంశిక్ష రు. 4-50

పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

ప్రభ అండ్ కో.

3, మలయ పెరుమాళ్ వీధి, మద్రాసు-1.

# సరాగమాల

వి.ఎ.కె. రంగారావు

ఆగస్టు 24వ తేదీన మద్రాస్ ఆకాశవాణి కేంద్రంలో షార్ట్‌వేవ్ మీద శ్రోతలు శ్రీ చిట్టిబాబు వీణాకచేరీ రాత్రి 9—30 నించి 10—30 దాకా వినొచ్చును. వారి అభిప్రాయాలు కూడా రాయొచ్చును. ఈ ప్రోగ్రాంలో హైలైట్స్ విరిబోణి (భైరవి) వాతాపి (హంసధ్వని) చలమేరా (మార్గ హిందోళం) నిరుపమాన (జావళి) మొదలగునవి ఉన్నాయి.

*  *  *

ఆగస్టు 30 వ తేదీ శ్రీ కృష్ణజయంతి. ఆ శుభదినాన ప్రత్యేకంగా వినవలసిన రికార్డుల జాబితా, చక్కని ఆర్టు పేపరుపై ముద్రించబడిన శ్రీమతి భానుమతి ప్రత్యేక చిత్రం కావాలంటే వెంటనే యాభై పయాపైసలు జోడించి సరాగమాల, కేరాఫ్ పత్రిక అని వ్రాయండి. వచ్చేవారం సరాగమాలలో శ్రీ కృష్ణజయంతి ప్రత్యేక వ్యాఖ్యకై ఎదురుచూడండి.

*  *  *

కొన్ని వారాల క్రిందట ఒక పాఠకుని లేఖ ననుసరించిన పాట, "ఎవరికోసం ఈ మందహాసం" వ్రాసినది సముద్రాల కాదు. అలా వ్రాసిన పొరబాటు నాది. ఆ పాట రచయిత శ్రీ శ్రీ.

*  *  *

హైదరాబాద్‌నుంచి కె. నాగేశ్వర్ ఇలా వ్రాశారు: "ఒక గొప్ప వాయిద్యగాడు (మీకు కూడా బాగా పరిచయమున్నవాడు అతనిపేరు వాయిద్యం తరువాత వ్రాస్తాను) ఈమధ్య ఒక కచేరీ జరిపారు. అతనికి శాస్త్రీయ సంగీతంలోను, లలితసంగీతంలోనూ ప్రావీణ్యం ఉంది. సభలో శాస్త్రీయ సంగీతం మెచ్చేవాళ్ళు ఎక్కువగా ఉన్నారు. లలితసంగీతం కోరేవారు కొందరున్నారు. అందులో ఒకాయన లలితసంగీతం గీతాలు ఒకటి రెండు వినిపించండి అని అడిగారు. అందుకు ఆయన నేను యిలాంటి సభలో లలితసంగీతం వినిపించను అని అన్నారు. దీనిపై మీ వ్యాఖ్య ?"

నేను వ్యాఖ్యానించే ముందు మీరు ముఖ్యంగా గమనించవలసిన విషయం ఇది. శాస్త్రీయంగా గానకచ్చేరీగాని, వాద్యకచేరీగాని చేసేవారు తమకు తామే కొన్ని నిబంధనలు, ఎటువంటిచోట ఎటువంటి పాటలు వినిపించాలి అన్న విషయం గురించి విధించుకుంటారు. ఇవి సమంజసమా కాదా అవునా అని ప్రశ్నించే హక్కు వినేవారికి లేదు. ఇక నా వ్యాఖ్య. ఆ సభ కేవలం సంగీత సభయే అయితే అక్కడ లలితగీతాలకు తావులేదు. కాని పెళ్ళి కచేరీగాని అటువంటి సాంఘిక మర్యాదలకు సంబంధించినదీ ఐతే లలితగీతాలు వినిపించవచ్చును. లలితగీతాలంటే సినిమాపాటలు కావు. స్తోత్ర కీర్తన, తిల్లానా, వర్ణ,పద, జావళీ ఆది సంగీత రచనలు కానివని మాత్రమే నా ఉద్దేశం.

నాకు ప్రత్యక్ష పరిచయం ఉన్న విద్వాంసులు చాల కొద్దిమందే ఉన్నారు. బాల మురళికృష్ణ కచేరీలలో, అవి ఎటువంటి కచేరీలైనా సరే స్నిగ్ధ శాస్త్రీయ గీతాలు తప్ప మరొకటి వినిపించరు. ఆఖరికి తామే రేడియోలో పాడిన పాటలు కూడా వినిపించడం నే నెప్పుడూ వినలేదు. చిట్టిబాబు పెళ్ళి కచేరీల చివర "కం సెప్టెంబర్", "రాకెన్ రోల్", "కోయిల పాట", "నెత్తి మొత్తుడు తాళం" లో "ఏమనందునే" వాయించడం విన్నాను. ఎక్కడో ఒకమారు శాస్త్రం తెలిసినవారు చాల తక్కువమంది ఉన్నచోట, ఆ కొద్దిమందిలో ఒకాయన వేదికపై తనతోబాటు కూర్చుని తప్పు తాళం వేసినపుడు "పాడవేల రాధికా", "మనమే నందనవనమే" వినిపించారట. ఎం. ఎల్. వసంతకుమారి ఎటువంటి కచేరీలలోనైనా చివర లలితగీతాలు వినిపించడం కద్దు. తమిళ "పెళ్ళికూతురు" సినిమాలో "ఎల్లాం ఇన్బమయం" పాట పాడగా రెండుమార్లు నేవిన్నాను. సినిమా పాటకచేరీకి తగినంతగా చేసిన ఘనత కీర్తిశేషుడైన సుబ్బరామన్‌ది.

*  *  *

హైదరాబాద్ నుంచే కె. ఉషా వ్రాసిన లేఖ :— "తెలుగువాళ్ళే హిందీ వరసలు కాపీకొట్టడం కాదు. హిందీవాళ్ళూ "కోప్రా" లో ఆపనే చేశారు. కాకపోతే "సుధమల్ సుహాసిని" "మేరేనయన్ డరేడరే" కాదా ! శాంతించు తల్లీ. ఇది కూడా కాపీ కొట్టింది తెలుగువాళ్ళే. అసలు ఆ వరస హేమంత్ కుమార్‌దే "దీప్‌జలే జాయ్" అనే వంగచిత్రంలోనిది. ఆ చిత్రాన్నే "చివరకు మిగిలేది" గా తెలుగులోకి అనువదించినపుడు ఆ వరసనూ ఉపయోగించుకున్నారు. హేమంత్ కుమార్ తన వరసనే, తన స్వంత హిందీ చిత్రంలో ఉపయోగించుకున్నాడు. ఇదీ దీని వెనుక కథ.

*  *  *

భానుమతి పాడిన "రారా నా స్వామి రారా" (విప్రనారాయణ), 'శ్రీకర కరుణాలవాల" 'పూయల లానినదీ నా మనసే" (బొబ్బిలి యుద్ధం) గురించి విమర్శిస్తూ వ్రాయండి. బాగున్నవాటికి, పదిమందికి, చక్కని ఫోటోలు, ఇంకెవరిది భానుమతివే, పంపిస్తాను. మీ విమర్శలు చాంతాళ్ళలా కాకుండా క్లుప్తంగా, ఒక పాట గురించి ఒక పేజీ మించకుండా వ్రాయాలి. ఒకరు ఒక పాట గురించే వ్రాయాలి.

*  *  *

భానుమతి పాడగా అసురాపానారి "పల్నాటి వీరకథ" కు మొదటి పాట రికార్డు చేశారు. పల్లవి "జయ జయ శంభో శివశంకర, జగదీశ స్వయంభో ప్రభూ" రచన సముద్రాల సీనియర్. సంగీతం ఎస్. రాజేశ్వరరావు.

55 వ పేజీ చూడండి

## ఇంటింటి పజ్యాలు

ఆరుద్ర

### 'బాబ్బాబు! నా తలమీద తేలు తీసెయ్యరూ'

మనసారా ప్రేమిస్తారు
అనుక్షణం సేవిస్తారు
భార్యలందరూ భర్తలచేతే పన్లు చేయిస్తారు
బజారుకెళ్ళినప్పుడు కూరలసంచీ మోయిస్తారు
ఉప్పుకోని తీసుకురాగానే పప్పుకోసం పంపిస్తారు
ఒక్కసారే చెప్పకుండా పదిసార్లు తిప్పిస్తారు
నొప్పించడ మెందుకూ ఆడహృదయాల తలంపులు
తప్పకుండా చేసేస్తారు వాళ్ళ పురమాయింపులు
రాత్రి రగ్గు కప్పుకొని హాయిగా పడుకొన్నప్పుడు
రసవత్తరంగా అవుతుంది పెరట్లో చప్పుడు
తలుపులు వేశామో లేదో లేచి చూడండంటే మాత్రం
తక్షణం నులిమేద్దామనుకుంటాను నా పెళ్ళాం గాత్రం! 




### జ రి గి న క థ

డాక్టర్ సీత, తన స్నేహితురాలయిన డాక్టర్ రాధకు తమ ఇంటిని గాధను చెపుతూ వుంటుంది... జానకి, సీత అక్కచెల్లెళ్ళు. జానకీ రామారావులకు పెళ్ళవుతుంది.

## 2

సాయంత్రం భోజనాలయాక సీత, రాధ ఇద్దరూ మేడమీద చెరో కుర్చీలో కూర్చున్నారు. రాధ మళ్ళా అడిగింది సీతని. సీత మళ్ళా చెప్ప సాగింది—

"అక్కయ్య పెళ్ళి వైశాఖ మాసంలో అయింది. జ్యేష్ఠ మాసంలో కాపురానికి వెళ్ళింది. అది కాపురానికి గుంటూరు వెళ్ళేరోజు. ఆ రోజున దాని ముఖంలో ఏ సంతోషమూ లేదు. ఏ మార్పూ రాలేదు. కళ్ళలో కాంతి లేదు. భారమైన ఆలోచనలతో దాని మనస్సు నిండి పోయింది. ఆవేదనా పూరితమైన అనుభవంతో దాని హృదయం పూడిపోయింది.

బావను చూస్తే ఎంతో సంతోషంగా ఉన్నట్లే కనుపించారు. ఎంతో చలాకీగా, సరదాగా ఉన్నారు. కారు ఎక్కపోతూ అక్కయ్య నా దగ్గిరి కొచ్చింది. "సీతా" అన్నది.

దాని కళ్ళల్లో నీరు చిమ్మింది. కనుకొలుకుల్లో నుంచి జారే ముత్యాల లాంటి కన్నీళ్ళు కింద పడకుండా పమిటి చెంగుతో తుడ్చుకుంది.

"ఎప్పుడు వీలయితే అప్పుడల్లా గుంటూరు వస్తూండవే సీతా. నువ్వు రాకపోయినా, నాకు ఉత్తరాలు రాయక పోయినా ఇంక సీత మిగుల్తుంది కాని జానకి కాదు. నా మీద ఆపేక్ష ఉంటే నా మాట తప్పక వింటావనుకుంటాను" అన్నది. కొయ్య బొమ్మలా కొయ్యబారి పోయాను. గొంతు పెగుల్చుకుని "అట్లాగేనే. తప్పక గుంటూరు వస్తాను. నిన్ను చూడంది నేనూ ఉండలేను." అన్నాను. అక్కయ్య కారెక్కింది. బావ పక్కనే కూర్చుంది. దుమ్ము రేపు కుంటూ కారు వెళ్ళిపోయింది.

నాన్న తృప్తిగా నవ్వుతూ అమ్మవైపు చూశారు. "చాలా బుద్ధిమంతుడు. యోగ్యుడు. తెలివి కలవాడు" అన్నారు నాన్న. అమ్మకూడా "అవును,

మన జానకి అదృష్టవంతురాలే" అన్నది.

నాకేం చెప్పటానికీ తోచలేదు. గదిలోకి వెళ్ళి కరువుతీరా తృప్తిగా ఏడ్చాను. అంతకన్న చెయ్య గలిగింది నాకేమీ కనబడలేదు.

అక్కయ్య వెళ్ళాక నాలుగు ఉత్తరాలు రాసింది. ప్రతి ఉత్తరంలోనూ నిరాశ, నిస్పృహ, కనిపించేవి. కారణాలు తెలిసేవి కాదు.

అక్కయ్య కోడంటరికం అనుభవిస్తోందా ? సుభద్ర ఏమైనా తంపులు పెడుతున్నదా ? బావ మంచి వారు కాదా ? స్త్రీలోలుడా ? జూదరా ? ఏమిటి ? అక్కయ్య ఎందుకట్లా ఉంటున్నది. దాని మనస్సులో బాధ ఏమిటి ? బావ పేకాటలో డబ్బు పోగొట్టుకుంటారా ? క్లబ్బులకు వెళ్ళి ఇంటికి రాక అక్కడే కాలం గడుపుతారా ? ఎంత ఆలోచించినా నాకు ఏమీ అర్థం కాలేదు.

ఒక ఉత్తరంలో ఇట్లా రాసింది అక్కయ్య:

సీతా,

ఈ నిర్భాగ్యురాలిమీద జాలిదలచి నువ్వు రాసిన ఉత్తరం చేరింది. జీవితంలో ఆశించినవి జరిగినా జరక్కపోయినా అంత బాధ పడము. ఆశించనివి జరిగినా అంతగా మనస్సు కష్ట పెట్టుకోము. కల్లోనైనా వూహించని సంఘటనలతో మనస్సును వ్యథ పెట్టే మాటలతో కట్టుకున్న భర్త కఠోరమైన మాటలంటుంటే ఇంక ఆ ఇల్లాలి బ్రతుకు బండలు కాక మరేముంది? అత్తపోరు కొంత మంది అనుభవిస్తారు. ఆడబిడ్డల తంపులు కొంత మంది చవి చూస్తారు. సంపాదన లేని భర్తతో కాపురం చేస్తూ ఆర్థిక బాధలకు గురవుతూ కాపురం చేస్తారు. కాని నా జీవితం లాంటి జీవితం ఎవ్వరూ అనుభవించరు. నా మనోవ్యథ ఎవ్వరితోనూ చెప్పుకోలేనిది. చెప్పినా నమ్మజాలనిది. అసలు ఎట్లా చెప్పాలో అర్థం కానిది. నా మానసిక సంక్షోభని నాలోనే ఇముడ్చుకుని కాలం గడుపుతున్నాను. ఏనాటి కయినా నన్ను ఆ మానసిక సంక్షోభ దహించి భస్మం చేస్తుందేమో ?

'జానకి'

ఆ ఉత్తరానికి ఏం సమాధానం రాయాలో నాకు తోచలేదు.

శ్రావణ మాసం వచ్చింది. నోములకు అక్కయ్య వచ్చింది. నాన్న వెళ్ళి అడిగితే గాని వాళ్ళు పంప లేదు. ఆ రోజున అక్కయ్య వస్తుందంటే నా సంతోషానికి హద్దు లేదు. రెండునెల్లకే ఎన్నో ఏళ్లయిన ట్లుగా ఉంది.

బండి దిగిన అక్కయ్యను చూడగానే దాన్ని ఎట్లా పలకరించాలో నాకు తోచలేదు. కొంచం నల్ల బడింది. చిక్కి పోయింది. నన్ను చూడగానే కౌగలించుకుని సంతోషంగా గబగబా ఎన్నోమాటలు మాట్లాడుతుందనుకున్నాను. ఏమీ లేదు. ఎంతో పెద్ద మనిషి తరహాగా, ముభావకంగా పలకరించింది. "ఏం సీతా కులాసాగా ఉన్నావా" అని.

"నీ కోసం వెయ్యికళ్ళతో ఎదురు చూస్తున్నానే" అన్నానూ నా సంతోషం పట్టలేక. అమ్మ కూడా "అదేమిటే అట్లా అయిపోయావ్. ఏమన్నా నుస్తీగా ఉన్నావా" అన్నది.

"ఏమీ లేదే. బాగానే ఉన్నాను. నువ్వే చిక్కి పోయావు" అన్నది అక్కయ్య. అంతకన్నా ఏమనాలో దానికి తోచలేదు.

రెండు రోజులు పేరంటాలు కబుర్లతో గడిచి పోయింది. అక్కయ్య అంతర్యం తెల్సుకోవాలని తహతహలాడి పోతున్నాను. ఎక్కడ నేను ఏ విషయాలు అడుగుతానో అని అక్కయ్య కొంచం తప్పుకుని తిరిగేది. ఎప్పుడూ అమ్మకు సాయం చేస్తూ అమ్మతోనే ఉండేది. నాకూ అక్కయ్యను ఎక్కువగా కన్పించుకుని అడగటానికి వీల్లేక పోయింది.

అక్కయ్య ముఖ కవళికలు గమనించేదాన్ని. ఎంత బింకంగా ఉన్నా ఆ ముఖంలో విచార రేఖలు పైకి కనిపిస్తూనే ఉండేవి. నేను చిన్న దాన్నను కుంటే అమ్మతో చెప్పవచ్చుగా. కాని అమ్మతోనూ చెప్పలేదు.

అమ్మ రెండో రోజునకాఫీలు అడిగింది.

"మీ ఆయన ఎట్లా ఉంటారే. మీ అత్తగారు నీతో కలుపుకోలుతనంగా ఉంటుందా." అని.

"మా అత్తగారు మంచిదేనే. అత్తా కోడనేళ్ళ మాటలోనే ఉంది కదా. అభిప్రాయ భేధాలు రాక తప్పవు. వచ్చినా అవి అంతగా బాధించేవి కాదు. మీ అల్లుడుగారంటావా, ఎట్లా ఉండేది పైకి కనబడుతూనే ఉన్నారుగా. ఇంక అడగటం ఎందుకూ" అన్నది అక్కయ్య ముభావంగానే. కాని ఏదో రహస్యము దాని మనసులో దాగి ఉందనే నా ధృఢ నమ్మకం. జరిగే విషయాలు అమ్మతో చెబితే అమ్మ మనస్సు కష్టపెట్టుకుంటుందనే ఉద్దేశ్యంతో చెప్పటం లేదేమో ననుకున్నాను. కాని ఆ విషయాలేమిటో ఎంత ఆలోచించినా నాకూ అంతుపట్ట లేదు.

మంగళవారం రేపనగా సోమవారంనాడు బావ దగ్గర్నుంచి వంద రూపాయలు మనియార్డరు వచ్చింది. శ్రావణ పట్టీకుగాను చీర కొనమని మనియార్డరు నాన్నగారి పేర ఉంది. అల్లుని మంచితనానికి నాన్నగారూ అమ్మా ఎంతో సంతోషించారు. అక్కయ్య మాత్రం ఏం మాట్లాడలేదు. దాని మనసులోని భావాలు ఎవ్వరికీ అర్థం కావు. ఎవ్వరికీ చెప్పదు. తొణకదు. కాని దాని సంసార జీవితంలో సుఖ సంతోషాలు తక్కువేనని నేను అర్థం చేసుకున్నాను.

"అల్లుడు పంపిన వంద రూపాయలతో ఏం కొనమన్నావమ్మా" అన్నారు నాన్న.

"ఇప్పుడేం వద్దు నాన్నా. నేను గుంటూరు వెళ్లిం తరువాత ఏమయినా కొనుక్కుంటాలే" అన్నది అక్కయ్య.

"అదేమిటే అతను పండక్కని పంపిస్తే నువ్వు తరువాత కొనుక్కుంటానంటావు. శుక్రవారం వరలక్ష్మి వ్రతానికి కంచి పట్టుచీరె కొనుక్కో నీకు నచ్చింది." అన్నది అమ్మ.

"చూద్దాంలేవే ఇప్పుడు తొందరేం" అన్నది అక్కయ్య.

"సరే నీ ఇష్టప్రకారమే చేద్దాంలే తల్లీ" అన్నారు నాన్న. అప్పటికా విషయం అట్లా తేల్చేసింది అక్కయ్య.

మధ్యాహ్నం భోజనాలయ్యాక నేను గదిలో కూర్చుని చదువుకుంటున్నాను. అక్కయ్య వచ్చింది.

"ఏమే సీతా, అట్లా కూర్చున్నావ్. ఇవ్వాళకు నీ చదువు కట్టిపెట్టు. మరి తాంబూలాలకి పేరంటాలు పిల్చి రావూ" అన్నది.

"అంటే నువ్వు రావా పేరంటం పిలవటానికి. నువ్వు రాకపోతే నేనూ వెళ్లను. నోము నోచుకునేది నువ్వూ, పేరంటం పిలవటానికి నేనూనా, అట్లా వీల్లేదు. నువ్వు రాంది నేను వెళ్లనే వెళ్లను" అన్నాను.

"నామాట నువ్వయినా వినవే సీతా. నేనెక్కడికీ రాను. నన్ను నువ్వు కూడా అపార్థం చేసుకుంటే ఎట్లా చెప్పు. నా బదులు నువ్వు వెళ్లి పిల్చిరా. మా అమ్మవి కదూ ! నా బంగారు తల్లివి ! వరహాల రాశివి ! రత్నాలు మూటవి ! వెండి కొండవి" అంటూ నవ్వి నా బుగ్గలు గిల్లింది.

అక్కయ్య అట్లా అంటుంటే నాక్కూ ప్రాణం లేచి వచ్చినట్లయింది. పెళ్లయ్యాక అక్కయ్య నవ్వు ముఖం చూట్టం అదే మొదలు. కాని ఆనవ్వు కూడా కొంచెం తెచ్చి పెట్టుకున్నట్టుగానే ఉంది. అవకాశం విడువకూడదనే ఉద్దేశ్యంతో నేనూ బెట్టుసరి చేద్దామని "ఎవరయినా మీ అక్కయ్య ఎందుకూ పిలవటానికి రాలేదంటే ఏం చెప్పను. మా బావ అక్కయ్యను ఎవరిళ్లకూ వెళ్లద్దన్నారుట, అని చెప్పనా. అంతేనా అక్కయ్యా" అన్నాను. నేనూ నవ్వి.

"ఏదో చెప్పవే సీతా ! నాకు నిజంగా ఎవరింటికీ వెళ్ళాలని లేదు. ఏమిటో, ఎందుకో చెప్పలేనే సీతా ! ఆలోచిస్తే నాకే అర్థం కాదు. సరే ఇంక వెళ్లిరా. చాలా ఇళ్లు పిలవాలి" అంటూ వెళ్లబోయింది. చెయ్యి పట్టుకుని లాగి అక్కయ్యను కుర్చీలో కూర్చో బెట్టాను. అక్కయ్య ఆశ్చర్య పడ్డది. అక్కయ్య ముఖంలోకి చూశాను. దాని కళ్లల్లో ఏదో తీరని ఆవేదన నాకు బాగా కనిపించింది.

"అక్కయ్యా ! నిజం చెప్పు. ఎప్పుడూ ఏదో దిగులుగా ఉంటావ్. పరధ్యాన్నంగా ఉంటావ్. ఎందుకనే జానకీ. నీ కష్టసుఖాలు నాకు తెలీ కూడదా" అన్నాను.

అక్కయ్య ఏమంటుందోనని ఆత్రంగా చూశాను. అక్కయ్య పేవలంగా నవ్వింది. నిరాశగా చూసింది. నిర్లిప్తతగా నిట్టూర్చింది. తేలిపోయిన భావాలతో చెప్పవలసిన విషయాలు దాస్తున్నట్లుగా నాకు తోచింది.

"ఏమీలేదే సీతా, బాగానే ఉన్నాను. చక్కగా తిని తిరుగుతున్నాను. వంట్లో ఆరోగ్యంగా ఉంది" అన్నది తేలిపోయే మాటలతో.

నేనింక ఉండబట్ట లేకపోయాను. అక్కయ్య ఎందుకిట్లా మారి పోయింది. రెండు నెల్లకే ఇట్లా మారిపోతే ఇంక కొన్ని సంవత్సరాలు పోతే అక్కయ్య నాతో అసలు మాట్లాడుతుందా అనే అనుమానం కలిగింది.

"జానకీ ! ఎంత ప్రయత్నించినా నన్ను మభ్యపెట్టలేవే. నీ కన్నా చిన్నదాన్ని. అవివాహితను భార్యా భర్తల మధ్య ఉండవలసిన మంచి చెడ్డలు నాకు తెలియవు. ఆ విషయాలు చర్చించ తగిందాన్ని కాదు. ఏమన్నా అడిగినా ఈ ముదినాపసాని కబుర్లు నీ కెందుకనే అంటావు. నేనేం సమాధానం చెప్పలేను. మనిద్దరి పైన ఇంకో అక్కయ్య ఉంటే, నేనడక్క పోయినా ఆ అక్కయ్యయినా అడిగి తెల్సుకునేది

అట్లాంటి అవకాశం లేదు కనక చిన్నదాన్నయినా నీ కష్ట సుఖాలు నాతో చెప్పుకోవచ్చు. చెప్పవూటే అక్కా " అని ప్రాధేయపూర్వకంగా అడిగాను.

అక్కయ్య నిరాశగా నవ్వింది. చెంగుతో కళ్ళు తుడ్చుకుంది.

"ఆ విషయాలన్నీ ఎల్లుండి మాట్లాడుకుందాం సీతా. ఇవాళా, రేపూ, నేచెప్పినట్లు విను." అని వెళ్ళి పోయింది. పుస్తకాలు మూసేసి నేనూ అక్కయ్య వెనకనే వెళ్ళాను.

పేరంటానికి వెళ్ళిన చోటల్లా అంతా అడిగారు. "ఏం సీతా, ఏమ్మా, మీ అక్కయ్య కూడా పిలవ టానికొస్తే అరిగి పోతుందా. అంతా చూసే వాళ్ళంగా" అని.

"అక్కయ్యని ఇక్కడే చూస్తే మీరు పేరంటానికి రారేమోనని అది రాలేదు." అంటూ అంటూ ప్రతీ ఇంట్లో తప్పించుకు వెళ్ళిపోయాను.

శ్రావణ మంగళవారం నోము నోచుకుంది. అంతా సవ్యంగానే గడిచింది. పిల్చిన వాళ్ళంతా పేరంటానికి వచ్చారు. మా ఇంటి ఎదురుగానే

# హృదయ కుసుమాలు

రంగమ్మ గారని ఉన్నారు. ఆవిడ ఏ పేరంటానికీ రాదు. అంతా వచ్చి వెళ్ళాక చివరికి ఏడు గంటలకి వస్తుంది. ఆవిడతో అంతా వచ్చినట్లే. ఆ రోజున ఆవిడా అట్లాగే ఏడుగంటలకొచ్చింది. వస్తూనే "ఏం జానకీ, కుశాసాగా ఉన్నావా. ఏం నగలు చేయించుకున్నావు. ఏమిటో నువ్వు కాపరానికి వెళ్ళి రెండు నెల్లే అయినా ఎన్నో నెల్లయి నట్లుంది. పెళ్ళికాక మునుపు ఆడ పిల్లలు చువ్వ లల్లే ఎదుగుతూ ఎంతకాలం ఇంట్లో ఉన్నా, పెళ్ళయ్యాక, ఒక్కసారే మారి పోతారు. ఎంతో పెద్దమనిషి తరహా, నిబ్బరమూ, హోర్నా వస్తాయ్యి. ఆడదాని జీవితమే అంత. మీ అత్తగారు కుశాసాగా ఉన్నారా. అన్నట్లు మర్చిపోయాను. మీ మామగారు మావారికి తెలుసుట. మావారు మీ ఆయన్ని కూడా ఎరుగుదురట. నీ పెళ్ళికి మావారు క్యాంపులో ఉంటం నుంచి వారికి రావ టానికి సందర్భపడలేదు" అన్నది రంగమ్మగారు. సాధారణంగా ఇట్లా అన్నప్పుడు నవ్వుతూ "అట్లాగా అంతా తెల్సిన వాళ్ళమే నన్నమాట. మంచిదే. ఎప్పు డన్నా గుంటూరు వచ్చినప్పుడు మా ఇంటికి రండి" అంటుందేమో అక్కయ్య అనుకున్నాను. కాని అక్కయ్య అట్లా అనక పోగా దిగాలుపడినట్లుగా కనిపించింది. ముక్తసరిగా "అట్లాగా" అని వూరుకుంది.

రంగమ్మగారు వెళ్ళిపోయాక అక్కయ్య బట్టలు మార్చుకునేందుకు గదిలోకి వెళ్ళింది. నేను అక్కయ్య వెనకనే వెళ్ళాను. అమ్మ వంటింట్లోకి వెళ్ళింది. "అదేమిటే జానకీ, ఆవిడ అలా అంటూంటే అట్లా దిగాలు పడిపోయావేం. వాళ్ళు ఎరుగున్న వాళ్ళయితే సంతోషించాలి గాని, అంత దిగులు పడిపోయావేం" అన్నాను.

"ఏమీ లేదే సీతా, ఏమన్నాను.. ఎట్లా ఉన్నాను. కాస్త తలనొప్పిగా ఉంది అంతే" అన్నది.

"కాదు. నీ కాపురంలో ఏదో కొరత ఉన్నది. నిన్ను చూస్తేనే మానసికంగా నువ్వు ఎంత బాధ పడుతున్నావో నేను తెల్సుకున్నాను. ఇంక నాకు చెప్పకకోతే నన్ను చంపుకు తిన్నంత వట్టే. రేపు సాయంత్రంలోగా అన్ని విషయాలు చెప్పేయ్యాలి. లేకపోతే అమ్మతో చెప్పేస్తాను. మీరంతా కలిసి అక్కయ్య గొంతు కోశారని ..........."

"సీతా" అంటూ అక్కయ్య నా నోరు మూసింది. కన్నీళ్ళు పమిటె చెంగుతో తుడ్చుకుంది.

నీకు పుణ్యముంటుంది. నన్నిట్లా బ్రతకనివ్వవే సీతా, అన్ని విషయాలు చెబుతాను. కాని ఎవ్వరికీ తెలియనీకు. అమ్మకూడా చెప్పొద్దు. ఆ పర మాత్ముడే, ఆ వెంకటేశ్వర స్వామే నన్నూ, నా కాపురాన్ని దారికి తీసుకొస్తాడు." అన్నది. నేనింక మాట్లాడలేక పోయాను.

రాత్రి భోజనాలయ్యాక అక్కయ్య, నేను నా గదిలో చెరో పక్కమీదా పడుకున్నాము. అమ్మ, నాన్నా నిద్ర పోయారు. అక్కయ్య ఏం చెపుతుందో నని ఆత్రంగా చెవులు నిక్కబొడుచుకుని పక్క మీద లేచి కూర్చున్నాను. రాత్రి పది దాటింది.

అక్కయ్య తన మంచం మీద నా వైపుకు తిరిగి పడుకుంది.

"చెప్పాల్సిందేనా సీతా ! అయినా పెళ్ళి కాని దానివి. ఈ పెద్దవాళ్ళ కబుర్లు నీకెందుకే? విన తగినవి, విన తగనివి ఉంటవి. అంత ఆరిందా గోవిందమ్మ వయావా వినటానికి" అన్నది.

"అక్కా, నువ్వు నన్ను మభ్యపెట్టి చెప్పకుండా తప్పించుకోలేవే. మొన్నటి వరకూ, నువ్వూ చిన్న దానివే. ఇప్పుడు మరి అన్ని విషయాల్లోనూ పెద్ద దాని వయావు. అనుభవం సంపాదించావు. అమ్మకు ఆడపిల్లలమైనా, మొగపిల్లలమైనా మనిద్దరమే. అమ్మ అమాయకురాలు. జీవితంలో సుఖాలే గాని కష్టాలు తెలియవు అమ్మకి. ఆవిడ ఏ అత్తా ఆడబిడ్డల మధ్య కాపురం చేసిందని ? అత్త లేని సంసారమే ! ఆడబిడ్డలు లేనే లేరుకదా. ఆవిడకు అత్తింటి కాపురం ఏం అనుభవం ఉంది ? ఆవిడ జీవితం అట్లాగే గడిచి పోతుంది. నీ కాపురం విష యం అమ్మకు తెలిస్తే ఆవిడ గుండెలు బాదుకో

35 వ పేజీ చూడండి

## దేవీ స్తుతి

### వేటూరి సుందరరామమూర్తి

పులకిత మీ ఉదయము మం  
జులకింజల్క పవన చోదితము కుహూ  
గళ మంగళ తూర్యారవ  
కలితరాగ సుధాపూర విలసితము చెలీ!

మనుగడ కొద్దికాలమభిమాన మహారము ప్రేయసీ మన  
స్సున నిది చెడ్డబాధ-మధుసూదన దివ్యపదారవిందసే  
వనమిక తారకమ్మని యవారణ తారణ మార్గలక్ష్మి చా  
రణగత ధూళి నొదలను రాల్చ భవత్పదమృత్తికలే చెలీ.

నాభవవీణపైని లలనాభవదీయకరాంగుళీనట  
వైభవమే మొగాని వినుపించిన నీ యనురాగ మూర్ఛనల్  
శోభలు దూసిపోసినవి స్రుక్కిన ప్రుక్కిడి జీవితానకున్  
ప్రాభవరాగబంధము నిరంతరమున్ భవమై హసింపగన్.

పట్టిన కౌగిలిన్ చెలగు పచ్చనిహాపములొచ్చు లోగిలిన్  
పెట్టిన దీపమట్లు నులివెచ్చని పచ్చని వెల్గులీనె-నే  
గట్టిన గాలిగోపురముగా నిలువెల్లను సున్నసిన్న-ఈ  
పట్టున దేవి నీవ మరు మందిర సుందర రూపమందితిన్.

పారువమై జనింతును అపార సుఖోదయ జీవసీవసీ  
చారణ హర్షవర్ష విలసత్ శ్రవణాంబుద పంక్తిద్రొక్కి సం  
సార మహార్ణవమ్ము క్రమశః పరితీర్ణత జెంది దేవినీ  
చారు విమాన గోపుర వసన్మధుమావలినై తరించెదన్!

హార్లిక్స్ చేసే మంచికి ఒక ఉదాహరణ!

# మా కాపురం పాడయ్యేది

అలసటతో, నిరుత్సాహముతో, బాధపడుతున్నానేమో
సంసారములో సుఖమేమిటని
మెట్ట వేదాంతములో పడి సంతోషాన్ని పోగొట్టుకొన్నాను






పాపం, నా భార్య మొదట్లో ఎంతో సహనము చూపేది. కాని ఆమె మాత్రము యీ పరిస్థితిని ఎన్నాళ్ళు భరించగలదు? విత్యమూ దేనికోదానికి మాటా మాటా వచ్చేది. సంసారములోని ఆనందమే మాయమయింది.



అదృష్టవశాత్తు, ఒక రోజున మేము డాక్టరు దగ్గరకు వెళ్లేము. డాక్టరు నన్ను పరీక్ష చేసేరు. శ్రమ మరియు వ్యాకులత శక్తి క్షీణతకు చాల వరకు కారణమని ఆయన చెప్పేరు.



నేను ప్రతి రోజు హార్లిక్స్ త్రాగుతే మళ్లీ ఆరోగ్యము మరియు ఉత్సాహ మును పొందగలనని ఆయన అన్నారు.



నేను హార్లిక్స్ త్రాగడము ప్రారంభించేను. అది చిట్కాలా పనిచేసింది. కొన్ని రోజులలోనే నేను పూర్వములా శక్తి ఉత్సాహములను పొందేను.



ఇప్పుడు నాకు చురుకుగా ఉండుటలోని రహస్యము తెలుసును కనుక నేనింక మళ్లీ నిరుత్సాహమును దగ్గరకు రానీయను!




## హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!

JWT HL 4812

## 21-8-1964 శుక్రవారము మొదలు 27-8-1964 గురువారము వరకు.

### మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారం మీరు ఘన విజయాల్ని ఏమీ సాధించ లేకపోయినా నిరుత్సాహపడవలసిన అవసరం కూడా ఉండదు. వృత్తి వ్యాపారాల్లో క్రమాభివృద్ధిని సాధిస్తారు. రావలసిన డబ్బు సమయానికి అందు తుంది. వృత్తిలో ముమ్మందు యోచించుటకు అవసరమైన మార్పులు రావచ్చును. అధికారుల వలన జరగవలసిన పనులకు ఆటంకాలు వస్తాయి. ఇతరులను నమ్మి ఏ వ్యవహారం ప్రారంభించడానికి సమయంకాదు. మీ ఆరోగ్యం బాగానే ఉంటుంది కాని సంతానానికి అనారోగ్య సూచనలు ఉన్నాయి. విద్యారంగంలో అభివృద్ధిని సాధిస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం అంత బాగా ఉండక పోవచ్చును. శుభ మూలంగా వ్యయం జరుగు తుంది. విలువైన వస్తువులు కొంటారు.

23, 24 తేదీలు మంచివి. 25, 26, 27 తేదీలు మంచివికావు.

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.)

అప్పుడప్పుడు మీకు అయిష్టమైన సంఘట నలు కొన్ని జరిగినా, మొత్తంమీద ఈ వారం బాగానే ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో నూతనావకాశాలు లభిస్తాయి. వ్యాపారంలో అనుకూల మైన మార్పులు రావచ్చును. రావలసిన డబ్బు సమయానికి అందక కొంత ఇబ్బంది కలుగు తుంది. కాని, కొంతమంది మిత్రుల సహాయం లభించడానికి అవకాశం ఉంది. ఉద్యోగంలో చెప్ప తగిన మార్పులు రావు. ప్రయాణం ద్వారా కార్య సాధన చేయగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. అన్ని వ్యవహారాలూ ఉత్సాహంతో నెరవేరుస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం గతవారంలో కంటే బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తి కరంగా ఉంటాయి.

25, 26, 27 తేదీలు చాలా మంచివి. మిగిలినవి సాధారణం.

### మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)

ఈ వారం ఇతరుల దృష్టిలో మీకు యోగ వంతమైనదే కాని, మీకు అంత సంతృప్తికరంగా కన్పించకపోవచ్చును. భాగస్వాములతో భేదాభి ప్రాయాలు రావడంవలన కొన్ని ముఖ్యమైన వ్యవ హారాలు నిలచిపోతాయి. వృత్తిలో శ్రమకు తగిన ప్రతిఫలం లభించకపోవచ్చును. ఉద్యోగంలో ఆదాయం పెరగకపోయినా గౌరవం మాత్రం బాగా ఉంటుంది. కోర్టు వ్యవహారాల్లో ఇంత వరకు మీకు వ్యతిరేకంగా ఉన్న పరిస్థితి తొలగి పోవచ్చును. దూర ప్రయాణాలు వాయిదా పడ తాయి. ఆరోగ్యం బాగాఉన్నా కొంచెం బలహీనత కన్పిస్తుంది.

మీ మే వృ మి

| | | | |
|---|---|---|---|
| | | గు | కు శు రా |
| శ | వారఫలం | | |
| చం | మహేష్ | | ర బు |
| కే | | | |

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

23, 24 తేదీలు మంచివి. 21, 22 తేదీలు మంచివికావు.

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

ఈ వారం అంత బాగా ఉండదు. మీరు ప్రయ త్నము చేసిన ప్రతి వ్యవహారంలోను ఆకస్మికంగా ఆటంకాలు రావడంవలన పొందవలసిన ప్రయోజ నాన్ని మీరు పొందలేని పరిస్థితి ఏర్పడవచ్చును. మీరు ఎంత మంచిగా ప్రవర్తించినా అది ఇతరు లకు చెడుగానే కన్పిస్తుంది. సాధ్యమైనంతవరకు అన్ని వ్యవహారాల్లోను మౌనంగా ఉండడం మంచిది. ఉద్యోగంలో అకారణంగా అధికారులతో భేదాభిప్రాయాలు రావచ్చును. ఆరోగ్యం బాగా ఉండదు. అనవసరమైన వ్యయం జరుగుతుంది. ముఖ్యమైన నిర్ణయాలు, కార్యక్రమాలు వాయిదా వేయడం మంచిది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయతగదు. సాంఘిక వ్యవహారాల్లో గౌరవం లభిస్తుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

25, 26, 27 తేదీలు మంచివి. 23, 24 తేదీలు మంచివికావు.

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈ వారం బాగానే ఉంటుంది. వృత్తి వ్యాపా రాల్లో అన్ని వ్యవహారాలూ చురుకుగా సాగు తాయి. అధికారులవలన జరుగవలసిన పనులు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు తలపెట్టడానికి సమయం కాదు. వృత్తిలో కార్యభారం పెరుగుతుంది కాని సమయానికి మిత్రుల సహాయం లభిస్తుంది. ఉద్యోగంలో అధికారుల ఆదరణ లభిస్తుంది. అనుకూలమైన మార్పులు కూడా వస్తాయి. వారాంతంలో అనారోగ్య సూచనలు ఉన్నాయి. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. సాహిత్య వైజ్ఞానిక రంగాల్లో ముందడుగు వేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో అనుకూలతా, బంధు వర్గాల్లో ఖ్యాతీ లభిస్తాయి.

> **సూచన**
>
> నూతన వ్యవహారాలు ప్రారంభించ డానికి, ముఖ్యమైన నిర్ణయాలు చేయడానికి మంచివి అని వ్రాసిన తేదీలు అనుకూలంగా ఉంటాయి. మంచివి కావి తేదీల్లో అననుకూలమైన సంఘటనలు జరగడానికి అవకాశం ఉంది. కాబట్టి జాగ్రత్తగా వ్యవహ రించడం అవసరం.

23, 24 తేదీలు మంచివి. మిగిలినవి మంచివి కావు.

### కన్య :

(ఉత్తర 2, 3 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

వృత్తి వ్యాపారాల్లో సామాన్యంగా జరిగే వ్యవహారాలకు కూడా వ్యయప్రయాసలకు గురి కావలసి వస్తుంది కాని తగిన ప్రతిఫలం కూడా ఉండడంవలన మొత్తంమీద సంతృప్తికరంగానే ఉంటుంది. వ్యాపారంలో మీ అభిప్రాయాలను మీకంటే పెద్దలు కూడా గౌరవిస్తారు. వృత్తిలో కొంతమంది ముఖ్యులైన వ్యక్తులతో పరిచయం ఏర్పడుతుంది. దానివలన ముమ్మందు ప్రయోజనం ఉంటుంది. ముఖ్యమైన కాంతాలు కాని, వస్తువులు గాని పోవచ్చును. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కాని, శరీర శ్రమతో కూడిన కార్యక్రమాలు పనికిరావు.

స్త్రీలకు— వారాంతంలో ఆరోగ్యం అంత బాగా ఉండకపోవచ్చును. కుటుంబ వ్యవహారాలు సంతృప్తి కరంగా ఉంటాయి.

21, 22 తేదీలు మంచివి. 23, 24 తేదీలు మంచివికావు.

### తుల :

(చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పా.)

ఈ వారం అన్నివిధాలా అనుకూలంగా ఉంటుంది. ఇంతవరకు వృత్తి వ్యాపారాల్లో ఏర్ప డిన అవరోధాలు తొలగిపోవడంవలన అభివృద్ధిని సాధించడానికి అవకాశం ఉంది. భారీయెత్తున చేసే వ్యాపారాల్లో శ్రమ పెరుగుతుంది. ఏదో ఒక విధంగా డబ్బు చేతికి రావడం వలన ఇబ్బంది లేకుండా కాలం గడచిపోతుంది. మీరు ఇదివరకు నిర్లక్ష్యం చేసిన వ్యవహారాలకు సురల ప్రాము ఖ్యత వస్తుంది. ఉద్యోగంలో మీ అశ్రద్ధవలన కొన్ని అవకాశాలను కోల్పోయే ప్రమాదం ఉంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాల్లో కొన్ని మార్పులు రావచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. బంధువులకు సహాయం చేస్తారు. ప్రయాణాలో చనలు వస్తాయి.

23, 24 తేదీలు మంచివి. 25, 26, 27 తేదీలు మంచివికావు.

### వృశ్చికం :

(విశాఖ 4—వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఈ వారం గడచిన కొద్ది వారాల కంటే బాగా ఉన్నా పూర్తిగా అనుకూలతను ఆశించడానికి

సమయంకాదు. మీరు చాలాకాలం నుంచి ప్రయత్నము చేస్తున్న వ్యవహారాలు ఇప్పుడు కార్యరూపం ధరించడానికి అవకాశం ఉంది. సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉండవు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. కోర్టు వ్యవహారాల్లో శ్రమమీద విజయాన్ని సాధిస్తారు. మీరు ఇప్పుడు జరిపే వ్యవహారాలవలన కొంత డబ్బు చిక్కుబడి పోయే సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది.

స్త్రీలకు— అనారోగ్య సూచనలు ఉన్నాయి. సాంఘిక వ్యవహారాల్లో బాధ్యతా, వ్యయమూ పెరుగుతాయి.

25, 26, 27 తేదీలు మంచివి. మిగిలినవి సాధారణం.

**ధనుస్సు :**

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

ఈ వారం చిత్రంగా ఉంటుంది. మీకు ఇంతవరకు సన్నిహితంగా ఉన్నవారికి వ్యతిరేకంగాను, ఇతరులకు సన్నిహితంగాను వ్యవహరించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. వృత్తి వ్యాపారాల్లో కొంత కాలంగా ఉన్న చిక్కులు ఇప్పుడు పరిష్కారం కాగల సూచనలు ఉన్నాయి. సమయానికి డబ్బు అందక కొన్ని వ్యవహారాల్లో ఇబ్బంది కలగవచ్చు. వృత్తిలో సాటివారితో పోటీ ఆకస్మికంగా పెరగవచ్చు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వృత్తి వ్యాపారాల్లో మార్పులను ఆలోచించడానికి ఇది సమయంకాదు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు రావచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం విషయంలో జాగ్రత్త అవసరం. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. నూతన విషయాలు లభిస్తాయి.

21, 22 తేదీలు మంచివి. మిగిలినవి సాధారణం.

**మకరం :**

(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)

ఏ వ్యవహారమూ పూర్తిగా నెరవేరే వరకూ నమ్మడానికి అవకాశంలేదు. వృత్తి వ్యాపారాల్లో కొన్ని అవకాశాలు ఇంద్రజాలంవలె కన్పిస్తాయి. కాని వాటికోసం ప్రయత్నం చేయడంవలన ప్రయాస తప్ప ప్రయోజనం ఉండదు. వృత్తిలో సాటివారితో పోటీ తగ్గవచ్చును కాని, చెప్పతగిన అభివృద్ధిని ఈవారం సాధించగల సూచనలు లేవు. ఉద్యోగంలో మీ పరిస్థితి సామాన్యంగా ఉంటుంది. కాని, మీ మంచితనం అధికారులచేత గుర్తింపబడుతుంది. మీకు అంతగా సంబంధంలేని వ్యవహారాల్లో చిక్కుకొనగల ప్రమాదం ఉంది. ఆరోగ్యం బాగా ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో ఉన్న భేదాభిప్రాయాలు తొలగిపోతాయి. విలువైన వస్తువులు కొంటారు.

21, 22 తేదీలు మంచివి. మిగిలినవి సాధారణం.

**కుంభం :**

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భా. 1, 2, 3)

ఈ వారం ప్రారంభంలోనే కొన్ని వ్యవహారాల్లో చికాకులు వచ్చేటట్లు కన్పిస్తాయి గాని వారాంతం వాటికి అన్ని వ్యవహారాలూ అనుకూలంగానే ఉంటాయి. వృత్తి వ్యాపారాల్లో నూతనావకాశాలు లభిస్తాయి. ఇదివరకు చిక్కి పోయిన వ్యవహారాలు కూడా లాభించగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు మీకు సంతృప్తికరంగా పరిష్కారం కావచ్చును. ఇంతవరకు భిన్నాభిప్రాయాలతో ఉన్న బంధువులను ఒక దారికి తీసుకొని రాగలరు. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది. బంధు సమావేశాల్లో పాల్గొంటారు. సాంఘిక వ్యవహారాల్లో ప్రాముఖ్యత లభిస్తుంది.

21, 22 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

**మీనం :**

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

ఈ వారం మొత్తంమీద బాగానే ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో అన్ని వ్యవహారాలూ ఒడుదుడుకులు లేకుండా సాగిపోతాయి. వ్యాపారంలో వెంటనే విశేషమైన ప్రయోజనం లేకపోయినా మున్ముందు యోగించుటకు అవసరమైన మార్పులు రావచ్చును. భాగస్వాములతో స్వల్ప భేదాభిప్రాయాలు రావచ్చును కాని వాటివల్ల ఏ కార్యక్రమమూ ఆగిపోదు. వృత్తిలో చాలా శ్రమమీద కొంత అభివృద్ధిని సాధిస్తారు. ఉద్యోగంలో కూడా కార్యభారం పెరుగుతుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు రావచ్చును. పుణ్యకార్యాలు చేస్తారు.

23,24 తేదీలుమంచివికావు. మిగిలినవిమంచివి. ★

# జన్మదిన ఫలం

## ఆగస్టు-21

ఈ సంవత్సరం ప్రారంభంలో మీరు చాలా చికాకులను యెదుర్కోవలసి వస్తుంది. మీరు యెంతో కృషి చేసి ఒకదారికి తెచ్చిన వ్యవహారాలు కూడా, ఫలితం చేతికి రాబోయేసరికి మరల మొదటికి రావడం వలన మీకు నిస్పృహ కలుగుతుంది. వ్యాపారంలో మీ అభిప్రాయాలను అమలు జరపడం కంటే భాగస్వాముల నిర్ణయానికి ముఖ్యమైన వ్యవహారాలు వదలి వేయడం మంచిది. ఉద్యోగంలో కొంత మంది పని గట్టుకొని మీ మీద దుష్ప్రచారం చేయగల ప్రమాదం ఉంది. అననుకూలమైన స్థానమునకు మార్చబడగల సూచనలు ఉన్నాయి. ఎప్పుడూ యేదో ఒక స్వల్ప అనారోగ్యం చేస్తూ ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు కూడా సంతృప్తికరంగా ఉండవు. సంవత్సరాంతంలో కొంచెం అనుకూల పరిస్థితి యేర్పడవచ్చును. విద్యార్థులు చాలా శ్రమ మీద కృతార్థులు కావచ్చును.

## ఆగస్టు-22

ఈ సంవత్సరం అంత సంతృప్తికరంగా ఉండక పోవచ్చును. వృత్తి వ్యాపారాల్లో మీరు కొన్ని అనవసరమైన వ్యవహారాల్లో చిక్కుకొనే ప్రమాదం ఉంది. ఇంత వరకూ మీకు సన్నిహితంగా ప్రవర్తించిన వ్యక్తులే కొంత మంది మిమ్మల్ని దగా చేయడానికి ప్రయత్నం చేస్తారు. ప్రతి వ్యవహారంలోను జాగ్రత్త చాలా అవసరం. భారీ యెత్తున చేసే వ్యాపారంలో నష్టం రావచ్చును. వ్యాపార రీత్యా చేయవలసిన దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. వృత్తిలో కూడా వ్యతిరేక వాతావరణం యేర్పడుతుంది. ఉద్యోగంలో అకారణంగా అధికారుల అదలింపులకు గురికాగలరు. ప్రతి వ్యవహారంలోను అనిశ్చిత పరిస్థితి యేర్పడడం వలన మానసికాందోళన తప్పదు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సంవత్సరం మధ్యలో రక్త సంబంధమైన అనారోగ్యం చేయవచ్చును. కుటుంబ వ్యవహారాల్లో కూడా కొన్ని చిక్కులు వస్తాయి.

## ఆగస్టు-23

ఈ సంవత్సరం గడచిన కొద్ది సంవత్సరాలకంటే బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీ ఆలోచనలు ఫలిస్తాయి. మీ ప్రయత్నం లేకుండానే వ్యాపారంలో మీకు అనుకూలమైన మార్పులు వస్తాయి. కేవలం మీ పనులే కాకుండా మీ మిత్రులకు సంబంధించిన వ్యవహారాలను కూడా సాధించగలరు. వృత్తిలో కొత్త వారితో పరిచయం ఏర్పడుతుంది. దానివల్ల చాలా ప్రయోజనం ఉంటుంది. ఉద్యోగంలో ఉన్నత స్థానం కోసం ప్రయత్నం చేయడానికి తగిన సమయం. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో ఏర్పడిన అభిప్రాయభేదాలు తొలగి పోతాయి. రాజకీయాల్లో ప్రతి పక్షాలు బలహీనం కావడం వలన మీ అభివృద్ధి మార్గం నిష్కంటకం కాగలదు. తీర్థయాత్రలు, పుణ్యకార్యాలు చేస్తారు. జీవితంలో అతి ప్రధానమైన సంఘటనలు జరిగే కాలం. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## ఆగస్టు-24

ఈ సంవత్సరం మొత్తం మీద సంతృప్తికరంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో అప్పుడప్పుడు కొన్ని చికాకులు యేర్పడినా మీ కార్యక్రమం యేదో ఒక విధంగా అడ్డు లేకుండా సాగిపోతుంది. అధికారుల వలన జరుగవలసిన పనులు కొంచెం శ్రమ మీద నెరవేరి లాభిస్తాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు సంవత్సర మధ్యభాగంలో యేర్పడిన అనిశ్చిత పరిస్థితి తొలగి పోయి అనుకూల వాతావరణం యేర్పడుతుంది. ఇంతవరకు కొన్ని వ్యవహారాల చిక్కుల్లో ఉండి పోయిన డబ్బు చేతికి వస్తుంది. కోర్టు వ్యవహారాలు కూడా అనుకూలంగా ఉంటాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కాని సంవత్సరం ప్రారంభంలోనే అనారోగ్యం చేయవచ్చును. శుభ కార్యాల విషయంలో బంధువుల సహాయం వలన అనుకూలత లభిస్తుంది. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు. వస్త్ర వ్యాపారస్థులకు కళాకారులకు మంచి సమయం.

## ఆగస్టు-25

ఈ సంవత్సరం మొత్తం మీద బాగా ఉన్నా

# వాటర్‌బరీస్ కాంపౌండ్

ఎఱ్ఱ లేబిలు

## త్రాగి దగ్గును ఎదుర్కోండి









విడవకుండా వచ్చే దగ్గు మీలోని రోగమును ఎదుర్కొనే శక్తిని పోగొట్టుతుంది, దేహమును బలహీనపరచి రోగములు కలిగే అవకాశమును కలిగిస్తుంది. వాటర్‌బరీస్ కాంపౌండ్ మూడు విధములుగా పనిచేస్తుంది: దానిలోని క్రియోసోట్ మరియు గయెకోల్ దగ్గునుండి ఉపశమనము కలిగించును. దానిలో చేరే ఇనుముయొక్క సత్తువ, బలవర్ధక పదార్థములు, మాల్ట్, ప్లీహ సారములు ఆకలిని పుట్టించును, కోల్పోయిన శక్తిని భర్తీచేయును, రోగము మళ్లీ రాకుండా ఉండేలా రోగనిరోధక శక్తిని కలిగించును.

ఏ శీతోష్ణస్థితిలోనైనా రోగనిరోధక శక్తికి ఎఱ్ఱ లేబిలుగల వాటర్‌బరీస్ కాంపౌండ్ త్రాగండి.



వాటర్‌బరీస్ కాంపౌండ్‌లోగల క్రియోసోట్ మరియు గయెకోల్ కఫమును విడతీసి ఉమ్మిలో పోయేలాచేయును మరియు కుళ్లటను అడ్డును. అవి ఊపిరితిత్తులను శుభ్రపరచును, దగ్గు, జలుబు, ఉబ్బసపు అసౌఖ్యము, శ్వాసనాళపు అస్వస్థతలను పోగొట్టుటలో సహకరించును మరియు రోగములు మళ్లీ రాకుండా చేయును.

# వాటర్‌బరీస్ కాంపౌండ్

**దగ్గు, జలుబు, శ్వాసనాళపు అస్వస్థతలు, ఉబ్బసపు అసౌఖ్యములను నివారించుటకు శక్తిని కలిగించును**

వార్నర్-లేంబర్ట్ ఫార్మస్యూటికల్ కంపెనీ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో సంస్థాపితము) JWT-WL. 2394

# జన్మదినఫలం

సంవత్సరాంతంలో కొన్ని చికాకులను యెదుర్కోవలసి వస్తుంది. వృత్తి వ్యాపారాల్లో క్రమాభివృద్ధిని సాధిస్తారు. నూతన వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో కూడా ఇంతవరకు ఉన్న పోటీ తగ్గి ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగం సంతృప్తికరంగా ఉంటుంది. అన్ని వ్యవహారాలూ అనుకూలంగా ఉంటూ ఉండగానే సంవత్సరాంతంలో ఆకస్మికంగా చికాకులు యేర్పడి వ్యయ ప్రయాసలకు దారి తీస్తాయి. స్థిరాస్థి వ్యవహారాలు అంత అనుకూలంగా ఉండక పోవచ్చును. ఆరోగ్యం సాధారణంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు యధాతధంగా జరిగి పోతాయి. బంధువులతో అభిప్రాయ భేదాలు రాగల సూచనలు ఉన్నాయి. విలాసయాత్రలు, వినోద కార్యక్రమాలు నెరవేరతాయి. ప్రేమ వ్యవహారాల్లో స్వల్ప అనుకూలత లభిస్తుంది. విద్యార్థులకు సెప్టెంబరు పరీక్షలు అనుకూలంగా ఉండవచ్చును.

## ఆగస్టు-26

ఈ సంవత్సరం మీరు విశేషమైన ఫలితాన్ని యేమీ పొందలేక పోయినా, మొత్తం మీద మంచి సంవత్సరమే అనే అభిప్రాయం సంవత్సరాంతానికి యేర్పడుతుంది. వ్యాపారంలో పనులు చురుకుగా సాగడం వలన ఆదాయం పెరగడానికి అవకాశం ఉంది. మున్ముందు ప్రయోజనం గల వ్యాపారాలు కొన్ని ఆలోచనకు వస్తాయి. వృత్తిలో సంతృప్తికరమైన పరిస్థితులు యేర్పడతాయి. ఉద్యోగంలో అధికారుల ఆదరణా సాటివారిలో గౌరవం లభిస్తాయి. కోర్టు వ్యవహారాల్లో ఉన్న వ్యతిరేకత చాలవరకు తగ్గిపోతుంది. వ్యాపారంలో పెట్టుబడి తక్కువైనా, యేదో ఒక విధంగా డబ్బు సర్దుబాటు కావడం వలన ఇబ్బంది కన్పించదు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో పలుకుబడితో పాటు బాధ్యత కూడా పెరుగుతుంది. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

## ఆగస్టు-27

ఈ సంవత్సరం అప్పుడప్పుడు కొద్ది చికాకులను యెదుర్కోవలసి వచ్చినా మొత్తం మీద బాగానే ఉంటుంది. వ్యాపారంలో కొంత శ్రమ మీద అభివృద్ధిని సాధిస్తారు. అధికారుల వలన జరుగవలసిన పనులకు మాత్రం యేవో ఆటంకాలు వస్తూ ఉంటాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు సంవత్సరాంతంలో ఫలించగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో స్వల్పంగా ఆదాయం పెరుగుతుంది గాని వ్యయం కూడా పెరగడం వలన అంత సంతృప్తికరంగా కనిపించదు. ఉద్యోగం బాగానే ఉంటుంది. అన్ని వ్యవహారాల్లోను సంవత్సరంలో రెండవ భాగం బాగా ఉంటుంది. ఆరోగ్యం బాగా ఉన్నా అప్పుడప్పుడు బలహీనత కన్పించవచ్చును. సాహిత్య వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు రావచ్చును. విద్యార్థులకు ఏప్రిల్ పరీక్షలు బాగా ఉండవచ్చును. వైద్యులకు, పారిశ్రామిక వేత్తలకు మంచి సమయం. ★

ఆదివిష్ణు



జేబులోంచి సిగరెట్టుతీసి ముట్టించాడు అది వెలగటానికి నాలుగు పుల్లలు ఖర్చయ్యాయి. ఆ దగ్గర్లో ఉన్న వంతెనమీద కూర్చున్నాడు. కాలు మీద కాలువేసిపై కాలిని కదల్చడం ప్రారంభించేడు.

తుకారాం!

వాడు కారా కిళ్లీలు వేస్తాడు. వాడి నోట్లో కిళ్లీ ఉన్నప్పుడు వాడిపక్క నించోడమే ఒక పెద్ద శిక్ష. వాడు మత్తుగా మాట్లాడుతాడు. ఆ మాటలు వింటూంటే చిరాకు. వాడు వెకిలిగా నవ్వుతాడు. వాడు నవ్వినప్పుడు బైటపడే ఆ ఎర్రటి పళ్ల మధ్య నల్లటి జీర చూస్తుంటే అసహ్యం.

అలాంటి తుకారాం, కారా కిళ్లీ నములుతూ వెకిలిగా నవ్వుతూ ఇంతమాట తనముందే అనేశాడు. అచ్చోసిన ఆంబోతులా ఉన్నాడు గనక సరిపోయింది. లేకపోతే రెండు వాయించేవాడే మరి.

ఒకనాడు సావిత్రికి తన గురించి గొప్పలు వ్రాసింది. వీడు వ్రాసిన వివరాలకి ఆ పిల్ల ఆనందించి తన పరిచయాన్ని కోరింది. అనగా— ఇప్పుడు తమ మధ్య ఇన్ని ఉత్తరాలు నడిచినందుకు ముఖ్యమైన కారణం తుకారాం!

ఆవేళ రోడ్డుమీద వెన్నెల సిగ్గు లేకుండా పగలబడి నవ్వుతోంది. వాతావరణం చల్లగానూ వుంది. సముద్రపు గాలి మెల్లగా మెల్లగా వీస్తూనేవుంది.

గౌరీపతి ఇంకా నడుస్తూనే ఉన్నాడు. టైం పదిగంటలు దాటింది. పదింబావు అయ్యింది. గౌరీపతి నడకవేగం తగ్గించలేదు.

వెనగ్గా స్కూటరు రావడం, హారను వాయించి— గౌరీపతి పరాకుని హెచ్చరించి మరీ వెళ్లిపోవడమూ జరిగింది. గౌరీపతి రోడ్డు దిగి పక్కన నుంచున్నాడు.

వెనక్కి తిరిగి చూశాడు. వూరు దాటి చాలా దూరం వొచ్చినట్టు గమనించలేదు. నడుస్తూంటే టైమూ, దూరమూ రెండూ తెలీలేదు

ఇంతాచేసి ఇప్పుడు ఎద్దేవా చేస్తాడు రాస్కెల్!

కోపంలో సిగరెట్టు దమ్ము గట్టిగా పట్టేండేమో గొంతంతా మండిపోయింది. కళ్లవెంట నీరూ కారింది. తెప్పరిల్లుకోడానికి రెండు క్షణాలు పట్టింది.

ఈ మాటు సిగరెట్టు పొగ నెంపాదిగా పీల్చాడు. మెల్లిగా పొగ ఒదిలాడు. నోరంతా చేదుగా ఉండంబ మూలంగా వక్కపొడి నోట్లో వేసుకున్నాడు.

ఆ రుచి తగలగానే కొత్త ఉత్సాహం పొంగింది. ఏక బిగిని రెండు దమ్ములు పట్టించేడు.

తుకారాం తొక్కుడు. లేకపోతే వాడిన్ని రంగులెలా మార్చగలడు? ఇంత గొప్ప నటుడెలా కాగలడు?

మొదట్లో తనకి రకమైన స్నేహంపట్ల అభిమానంలేదు. ఎక్కడో ఏదో వూళ్లో ఉన్న వ్యక్తికి అనేక విషయాలపైన ఉత్తరాలు వ్రాసి వాటిపైన అవతలివాళ్ల అమూల్యాభిప్రాయాలూ, వాళ్ల ఆదర్శాలూ, ఆశయాలూ కనుక్కోవాలనే మహత్తర జిజ్ఞాస తనకిలేదు.

తుకారాంకి చాలా వూళ్లనుంచి చాలా ఉత్తరాలొచ్చేవి. ఆడ, మగ అనే వ్యత్యాసంలేదు. ఈ స్నేహితులకి వూరూరా సంఘాలూ ఉన్నాయి. అప్పుడప్పుడు సమావేశాలు జరపడమూ కద్దు. దీనికోసం ప్రత్యేకంగా ఒక శీర్షిక నడుపుతూ, ప్రతి ఆదివారం— ఆ శీర్షికలో కొత్త సభ్యులూ, వాళ్ల చిరునామా, వాళ్ల వ్యాపకాలూ వగైరా ప్రచురించి పాత సభ్యులకు పరిచయ భాగ్యం కలుగజేస్తోంది ఒకానొక దినపత్రిక. తుకారాం ఈ కార్యక్రమాల్లో తలనిండుగా మునిగి తిరిగే మనిషి.

అతను తనతోపాటు చదువుకున్నాడు. తను బి.ఏ. పూర్తిచేసిన గుమస్తా. అయినా తుకారాం బి.ఏ.పరీక్ష కాలేదు. ఈ పరీక్షలూ, ఉద్యోగాలూ అతనికి అనవసరమని అతనే చెప్తూంటాడు. వూళ్లో వాళ్ల నాన్నగారికి మంచి పలుకుబడితోపాటు లక్షలూ ఉన్నాయి. గొప్ప వ్యాపారమూ ఉన్నది. మనిషనే వాడికివి చాలవూ? వేరే ఉద్యోగాలెందుకు? దమ్మిడీకి కొరగాని ఈ పరీక్షలెందుకు?

ప్రతి సాయంత్రం— తుకారాం స్నానం వగైరా ముగించి, ముస్తాబై వూళ్లో ఫాన్సీకార్నర్‌లో నించుంటాడు. బుగ్గన కారాకిల్లీ చేతిలో సిగరెట్టు పాకెట్టూ తప్పనిసరిగా ఉండాలి. ఒచ్చేపోయే మనుష్యుల్ని వోరగంటితోనూ, కారాకిల్లీ నోటితోనూ నవ్వు మొహంతోనూ పలకరించడం అతని హాబీ!

పాతికేళ్లయినా లేని తుకారాం ఫస్టుక్లాసు తొక్కుడని మళ్లీ అనుకున్నాడు గౌరీపతి.

పున్నమి. పుచ్చపువ్వులాంటి వెన్నెల్ని హాయిగా అనుభవించే భాగ్యాన్ని తుకారాం మాట పూర్తిగా తినేసింది. మనిషిని చిత్రవధచేసినట్టు మాట్లాడాడు.

సావిత్రి తుకారాంకి ఉత్తరాలు వ్రాసేది. 'అన్నయ్యా!' అని సంబోధిస్తూ ఎంతో తీయగా, హాయిగా వ్రాసేది. తుకారాం ఆ ఉత్తరాలన్నీ తనకి చూపించేడు. నిజానికి చాలాచక్కగా ఉత్తరాలు వ్రాయగలదు సావిత్రి.

తనకొచ్చిన మొదటి ఉత్తరం 'గౌరీపతి అన్నయ్యగార్కి' అని ప్రారంభించి వ్రాసింది. వాళ్లమ్మకీ నాన్నకీ గౌరీపతి ఒక్కడే సంతానం. సావిత్రి ఉత్తరం, ఆ పిల్ల సంబోధనా అతని గుండెల్లో ఆనందాన్ని నింపింది. ఒక నూతన అనుభూతినీ, ధరకట్టలేని ఆనందాన్నీ గౌరీపతి పొందేడు. ఈ జీవితానికీ భాగ్యం చాలనీ అనుకున్నాడు.

తుకారాంకి తన మనసు తెలీదు. అతను రంగుటద్దాల్లో ఎదటివాడిని చూస్తాడు. గనకనే అనుక్షణం అతను ఆత్మవంచన చేసుకుంటున్నాడు.

సావిత్రికి రాసే ఉత్తరాల్లో ఆ పిల్లని 'చెల్లీ' అని సంబోధిస్తూగూడా— అతని హృదయంలో ఓ మూలగా 'కోరిక' దాచుకున్నాడు తుకారాం! పైపెచ్చు నోటికొచ్చినట్టు వాగడం!

ఛీ......ఎందుకీ విలువలేని మనుషులు?

ఇంతా చేస్తున్న తుకారాం అంత నిబ్బరంగా ఎలా నవ్వగలడో మరి. అతనంటాడు—

"నిజం భాయ్! ఆడపిల్లలకి ఉత్తరాలు వ్రాయడంలోగల సరదా మరి దేన్లోనూలేదు. కాపోతే సభ్యత అనేది లోకానికి భయపడైనా పాటించాలి గనుక ముసుగుతో అవసరం కలిగింది. చెల్లీ అని వ్రాయకపోతే అవతల్నుంచి రెండో ఉత్తరం రానే రాదసలు. గనకనే ఈ పథకం. పైగా— ఇది మొగవాడొక్కడే ఆడుతూన్న నాటకంకాదు. ఆడ శాల్తీలూ చేతులు కలపాలి. మొన్నీ మధ్య నా ఫ్రండొకడు పెళ్లిచేసుకున్నాడు. వాడు ఆ అమ్మాయికి, నేనిప్పుడు సావిత్రికి రాస్తున్నట్టే ఉత్తరాలు రాసేవాడు మునుపు. దీన్నేమంటావ్ మరి? కాబట్టి పలకరింపుల్లో పట్టించుకోవలసిందేమీ లేదు. కొంపలూ మునిగిపోవు."

తుకారాం రాటుదేరిన మనిషి. అతన్ని ఒప్పించడం తన చాతనయ్యే పనికాదు. ఎవడి అభిప్రాయాలు వాడివని అతనెంత దారుణంగా మాట్లాడుతున్నా వినిపించుకోనట్టు నటిస్తే, చివరికి తననే వేలెత్తి చూపించాడు.

సావిత్రికి ఉత్తరాలు వ్రాయడంలో గౌరీపతికి తప్పు కనిపించలేదు. అలాగే ఆ పిల్లానూ. కానీ ఆమె చేసిన తప్పు ఒక్కటే— తనకి ఉత్తరాలు వ్రాయడం ప్రారంభించిన తర్వాత మెల్లిగా తుకారాంకి వ్రాయడం తగ్గించుకుంది. ఇది అతనికి కడుపుమంటగా తయారైంది. కసితో తనని గోలపెట్టాడు, అదీ పదిమందిలోనూ—

"ఈ మధ్య సావిత్రీదేవికి మా పైన దయ తప్పింది. మాకంటే యోగ్యుడు దొరికాడుగా— ఇక మేము కనిపిస్తామా? వల్లకాడా? వారానికి రెండు ఉత్తరాలొచ్చేవి. అలాంటిది రెండు నెలలయ్యింది, ఇప్పటికొచ్చి ఒక్క ఉత్తరమూలేదు. పది ఉత్తరాలు పోస్టుచేశాను. కనీసం అందినట్టయినా రాయలేదామె. ఇదేనా మర్యాదా?"

అతనీ మాటలంటూండగా గౌరీపతి నవ్వడం తప్పయింది. దాచుకున్న అతని ఈర్ష్య ఒక్కసారిగా విజృంభించింది,

"అవునుమరి— కథలు వ్రాసేవాళ్లమీద ఆడకూతుళ్లకి మోజు పెరిగిపోతుందని ఎవరో అన్న మాట తప్పుగానేగాదు. ఇదివరకు నమ్మలేదుగానీ ఇప్పుడిక నమ్మక తప్పడంలేదు."

"నోర్ముయ్." అన్నాడు పతి.

"నా నోరెందుకులే గురూ! నేనెంత వాగినా విలువా, మన్నా? నీ నోరు తెరుస్తే కవిత్వం, రాస్తే కావ్యం! సావిత్రిలాంటి పిచ్చుకమ్మలున్నంతవరకూ నిక్షేపంగా వర్థిల్లు!" అన్నాడు తుకారాం నిష్ఠూరంగా.

"నువ్వనేదాంట్లో అర్థమేమైనా ఉందా? సావిత్రి ఎవరు? నేనెవరు? మా ఉత్తరాల్లోగానీ, మనసుల్లోకానీ నువ్వూహిస్తున్న నీచం ఉండదసలు. వాళ్లెవరో ఒకనాడు నువ్వే చెప్పావ్ నాకు."

"అప్పుడు కొందర్నే చెప్పాను. ఇప్పుడు కావలొస్తే నీబోటి ఆదర్శ రత్నాలని వందల్లో చెప్తాను. శ్రీరంగనీతులు పలక్కు. నీ గుండెమీద చేయి వేసుకుని చెప్పు. నీకా పిల్లమీద సదభిప్రాయమే ఉందా?"

"గౌరీపతి తుకారాం కాదు".

"అలాగేం. కనిపించే ప్రతి ఆడపిల్లా నా సోదరని చెప్పుకునే గౌరీపతుల జాతకం తుకారాంకి బాగా తెలుసు భాయ్!.....నాకు అసూయ ఉంది. అది నీ ఒక్కడిమీదే కాదు".

—గౌరీపతి చేయి చురుక్కుమంది. సిగరెట్టు అవరంటా కాలిపోయింది. దాన్ని కిందపారేసి చెప్పుతో తొక్కేడు.

అక్కడ్నుంచి లేచి, వూరివైపు నడక ప్రారంభించేడు. ఇంతకుమునుపు కనిపెట్టలేదుగానీ ఇప్పుడతని కాళ్లు నొచ్చుతున్నాయి. ఒంట్లో నిస్సత్తువుగానూ ఉంది. సమయానికి బందరుకోటనుంచి సిటీబస్సు ఒచ్చిందిగానీ లేకపోతే ఇంటికి ఏ స్థితిలో వెళ్లేవాడో మరి.

* * *

సావిత్రి దగ్గర్నుంచి మూడుత్తరాలొచ్చేయి. ఒక్కదానికి జవాబు వ్రాయలేదు గౌరీపతి. అసలు సావిత్రికి ఉత్తరాలు వ్రాయరాదనే నిర్ణయానికి వచ్చేడు.

వారం రోజులక్రితం అడ్రసు వ్రాసి ఉంచిన కాళీ కవరు అతని జేబులో బాగా నలిగిపోయి ఉంది. రెండు మూడు మాట్లు ఉత్తరం వ్రాశాడుగానీ కవర్లో పెట్టి పోస్టు చేయడానికి మనసొప్పక— వ్రాసిన కాగితాలన్నీ చింపేయడంగూడా జరిగింది.

మళ్లా సావిత్రి దగ్గర్నుంచి పెద్ద ఉత్తరం వచ్చింది. పత్రికలో ప్రచురించిన తన కథ గురించి చాలా రాసి, కొంచెం కోపాన్ని అభినయిస్తూ ఉత్తరాలకి జవాబులు వ్రాయని పెద్ద రచయిత అన్నగారు దీనికైనా తీరుబడి చేసుకుని జవాబు వ్రాయకపోతే నిరాహారదీక్ష ప్రారంభించడం ఖాయమనే అల్టిమేటమ్‌తో పూర్తిచేసింది.

గౌరీపతి నొచ్చుకున్నాడు. ఇంత చనువుగా వ్రాస్తున్న సావిత్రినేనా తుకారాం అనుమానిస్తు? ఆ పిల్లనేనా తక్కువచేసి మాట్లాడుత?

ఇంతా అనుకున్న గౌరీపతి ఆ ఉత్తరానిగ్గూడా జవాబు వ్రాయలేదు. ఆ రాత్రి పడుకునే ముందు మాత్రం సావిత్రి ఉత్తరాల గురించీ, తన ప్రవర్తన గురించీ రెండు ముక్కలు డైరీలో వ్రాసుకున్నాడు.

నాలుగు రోజుల తర్వాత సావిత్రి దగ్గర్నుంచి ఒచ్చిన మరో ఉత్తరాన్ని చదవడానికిబదులు ఒంటరిగా కూర్చుని ఏడ్చేడు. చదవకుండానే చించి పారేశాడు. ఆ రాత్రి డైరీలో వ్రాసుకున్నాడు—

'సావిత్రి ఉత్తరం చదవకుండానే చించేను. ఉత్తరమైతే చింపగలిగేనుగానీ— దాన్లో వ్రాసిన ప్రతి అక్షరాన్నీ వూహించగలను. తుకారాం గుర్తు కొస్తూంటే భయంగా ఉంది. వాడు మా పాలిట యముడు.'

ఫాన్సీ కార్నర్‌లో తుకారాం చాలామాట్లు కనుపించేడుగానీ చూడనట్లు తప్పించుకు వొచ్చేవాడు గౌరీపతి. కానీ ఓ ఆదివారం ఉదయం స్వయంగా తుకారామే గౌరీపతి ఇంటికి వచ్చేడు. వొచ్చీ రావడంతోనే ప్రారంభించేడు—

"నన్ను క్షమించాలి గురూ! ఏదో ఉద్రేకంలో నిన్ను మాటలని నొప్పించినమాట నిజమే కావచ్చు. అంతమాత్రంచేత పగపట్టినట్లు నన్నుచూసిగూడా తలొంచుకు పోతున్నావు నువ్వు. ఒకటో రెండు రోజులైతే సహించగలను. చూస్తూంటే నెలలు

గడిచినా నీ పద్ధతి మార్చుకోలేకపోతున్నావు. మారిచి పోయావు. మన నాలుగేళ్ల స్నేహాన్ని దూరం చేయకు. బ్రదర్! సావిత్రి అనే ఆడపిల్ల గురించి మనిద్దరం ఏకాభిప్రాయానికి రాలేదనే నెపం కొద్దీ నన్ను వెలివేయకు. నీకూ తెలుసు నేను చాలా మంచివాడినని. స్నేహమంటే ప్రాణం పెట్టే మనిషినని. నాకు నీ స్నేహం కావాలి. మన అభిప్రాయాలు గాలికి వదిలిపెడదాం. నువ్వు నన్నూ, నేను నిన్నూ ద్వేషించుకోవద్దు."

ఆ మాటలంటూండగా తుకారాం కళ్లల్లో నీళ్లు నిలిచేయి. గౌరీపతి తుకారాం భుజం తట్టి మెల్లిగా నవ్వేశాడు. తుకారాం కళ్లు తుడుకుంటూ అన్నాడు—

"చాలు బ్రదర్! ఇప్పుడు వెయ్యేనుగుల బలం వొచ్చిందినాకు. చాలా సంతోషంగా ఉంది."

గౌరీపతి భవదీయుడికి బాగా తెలుసు. ప్రస్తుతం అతను తోటి కథకుడు, తోటి ఉద్యోగిను. బక్కగా, రెనటలా, ఎత్తుగా, ఎర్రగా ఉంటాడు. అతని మీసాలు మరింత ముచ్చటగానూ, ఆ ఆకారానికో హుందాగానూ ఉంటాయి. అతను నిజానికి చాలా మంచివాడు, కొంచెం పసిమనసు గలవాడూను.

గౌరీపతి మావూరివాడు. నాతోపాటు చదువుకున్నాడు. నా చదువు పూర్తికావడంతోనే ఉద్యోగరీత్యా నేనీ వూరు రావడంతో మా యిద్దరిమధ్య కొంచెం దూరంలాటిది కలిగింది.

కానీ, వోనాడు ఆఫీసు ఆర్డరు చూచి గంతులేశాను. గౌరీపతి అనబడే నా స్నేహితుడు ప్రమోషనుమీద మా ఆఫీసుకి బదిలీ కావడం నాకు నిజంగా సంతోషం కలిగించింది.

గౌరీపతి ఈవూరికి రాకపోతే మా వూళ్లో జరిగిన పై కథ నాకు తెలిసేదికాదు. అంతమాత్రం చాత అతనొచ్చిన వెంటనే నాకీ కథ చెప్పలేదు.

నాలుగు రోజులుపాటు అతను మా అద్దె గదిలో 'గెస్టు'గా ఉన్నాడు. అప్పటికే నాలుగు జీవాలు మా గదిలో నివసించడంవల్ల అతనికోసం ప్రత్యేకంగా మరోగది వేట తప్పనిసరైంది. కానీ ఓ పట్టాన దొరికింది కాదు.

ఓరోజుదయం పదకొండు గంటల ప్రాంతాల



# తప్పు

మా ఆఫీసుకి ఓ పొడుగుపాటి అమ్మాయి వొచ్చింది. రెండు జడలూ, ఓ జడలో గులాబిపువ్వూ. ఎడం చేతికి వాచీ. ఖరీదైన దుస్తులూ—చప్పున చెప్పొచ్చు. కాలేజీలో చదువుతూన్న, కాలేజీ మొన్నీ మధ్యనే వొదిలిన ఆడపిల్లని.

మా ఆఫీసులో కుర్రవాళ్లెక్కువ. ఆ అమ్మాయిని చూడగానే ఆఫీసు వాతావరణంలో చెప్పుకోదగ్గ మార్పు కనుపించింది. ఆ అమ్మాయి ఆఫీసంతటినీ కాసేపు తన అందమైన కళ్లతో పరీక్షించింది. ఆఫీస్ ప్యూన్ మునుస్వామి నేదో అడిగింది.

మునుస్వామి గబగబా గౌరీపతి సీటు దగ్గరికొచ్చి ఏదో మెల్లిగా చెప్పేడు. గౌరీపతి మా ఆఫీసుకి కొత్తవాడవడం మూలంగానూ, అతనికోసం ఓ సివిలైజ్డ్ యువతి ఆఫీసుకి రావడంతోనూ—మావాళ్లందరూ సస్పెన్సులో మునిగిపోయేరు.

గౌరీపతి సీట్లోంచి లేచేడు. ఆ అమ్మాయి దగ్గరి కెళ్లాడు. మరి కాసేపట్లో యిద్దరూ కలిసి బైటకెళ్లిపోయేరు. నిజం చెప్పద్దూ—ఆక్షణంలో గౌరీపతిమీద 'ఇది' అని చెప్పలేని భావ మేదో కలిగింది గానీ వెంటనే దాని మర్చిపోటానికి సర్వవిధాల ప్రయత్నించేను.

ఆ సాయంత్రం రూముకొస్తూ దార్లో ఆమె గురించి చెప్పేడు. గౌరీపతి. ఆమెపేరు సావిత్రిట! కొన్నాళ్ల క్రితం అతనికి కలం స్నేహితురాలుట. తను యీవూరి ఆఫీసుకి బదిలీ అయినట్టు తెలిసి చూడటానికి వొచ్చిందిట.

ఆ రాత్రి పడుక్కునేముందు గౌరీపతి మిగతా కథ గూడా చెప్పేడు. కథలో పరిచయమైన తుకారాంని, అతని నిజాయితీని మెచ్చుకోక తప్పింది కాదు. తన అభిప్రాయాల్ని తప్పొప్పులతో ప్రమేయం లేకుండా కుండ బద్దలు కొట్టినట్టు చెప్పుకోగల తాహతు ఎందరికుంది? గౌరీపతి ఈవూరొస్తున్నట్టు సావిత్రికి ఉత్తరం రాసింది తుకారాంట!

మరుసటిరోజు గౌరీపతి అన్నాడు—

"నా కెలాగో రూము కావాలి. మొదట్లో సావిత్రిని పలుకరించరాదనే అనుకున్నాను గానీ, ఇప్పుడు రూములేక నే పడుతూన్న అవస్థ కంటె సావిత్రి వాళ్లింట్లో ఓ గది తీసుకోవడం మంచిదనుకుంటున్నాను."

"నువ్వీ విషయం ఆ అమ్మాయితో చెప్పేవా ?"

"సావిత్రే నన్ను అడిగింది—అభ్యంతరం లేకపోతే వాళ్లింట్లో ఉండిపోవచ్చని. అఫ్‌కోర్స్—రెంట్ పే జేస్తాననుకో."

"అదృష్ట జాతకుడివి. ఒక అందమైన ఆడపిల్ల యింట్లో కాపురం అందరికీ దొరకమంటే దొరుకుతుందా ?" అనేశాను. కాదంటే అలా అని నోరు జారాను.

నేనీ మాట అనడంతోనే అతను చాలా సీరియస్‌గా మారిపోయేడు.. తల దించుకుని నిష్ఠూరంగా అన్నాడు.

"నువ్వూ తుకారాంలాటి మనిషివే. మీ కందరికీ చాలా దారుణమైన ఆలోచనలున్నాయి."

నేనేం మాటాడలేదు. నే నన్నది తప్పని వొప్పుకోడానికి సిగ్గుపడను. కానీ నేను తుకారాంలాటి మనిషిని కాను. సిద్ధమైనంతవరకూ నా అభిప్రాయాలు దాచుకోడం అలవాటు నాకు.

* * *

గౌరీపతి సావిత్రి వాళ్లింట్లో మకాం పెట్టినట్టు వారం రోజులు తిరక్కుండానే ఆఫీసంతటికీ తెలిసింది. వాళ్ల 'దారుణమైన ఆలోచనలు' నేనూ విన్నాను. గౌరీపతి విషయం తెలిసినవాడిని గనక వాళ్లని హెచ్చరించడం గూడా జరిగింది. ఏమైతేనేం 'కొత్త పక్షి దేవాంతకుడు' అనే కామెంట్ ఆఫీసులో విజృంభించేసింది.

ఏదో సభలో విన్నాను. వివరాలన్నీ గుర్తుకు లేవుగానీ మనసుకి నచ్చిన ఈ ఒక్క వివరమూ గుర్తుకున్నది. 'నేటి కథా సాహిత్యం' అనే విషయం పైన వయస్సులో పండిపోయిన పెద్ద రచయితలు మాట్లాడుతూ ఈనాటి యువ రచయితల మీద ఓ విసురు విసిరేరు. ఇప్పుడు కథలు రాసే కుర్రాళ్లు కేవలం 'లవ్ స్టోరీస్' వ్రాసి ఆడపిల్లల దగ్గర్నుంచి ఉత్తరాలు రాబట్టుకోడమే ఒకే ధ్యేయంగా పెట్టుకున్నారని ఉద్ఘాటించారు.

ఇది విన్న ఓ యువ రచయిత చప్పున వేదికెక్కి తన ఆవేశాన్ని గంభీరోపన్యాసం ద్వారా తెలియజేశాడు. పెద్దలన్నట్టు ఆడపిల్లల మన్ననలు పొందుతూన్న కుర్ర రచయిత నిజానికి అదృష్టవంతుడని, ఆ రోజుల్లో వూరికో రచయితైతే ఈనాడు ఇంటికో రచయితై 'కాంపిటీషన్' పెరిగి రోజురోజుకీ నూతనమైన ప్రయోగాలతో కొత్త కొత్త పద్ధతుల్ని ప్రవేశపెట్టి కథా రచన స్థాయిని పెంచిన కుర్ర రచయితకి వొస్తూన్న ఈ అభినందనలని సహించలేక పోటీలు లేని ఆ రోజుల్లో ఘనులనిపించుకున్న 'పెద్దయ్య' గార్ల విసురులో కేవలం ఈర్ష్య కనిపిస్తుందని తిరిగి అంటించాడు.

ఏతావాతా చెప్పొచ్చేదేమిటంటే గౌరీపతి కిదంతా తెలుసు. అలాంటప్పుడు జనం ఏమనుకుంటేనేం అని తుడిచిపెట్టుకు తిరగాలి. కానీ అలా జరగడం లేదు. అదీగాక అతను సావిత్రితోపాటు షికార్లకి వెళ్లేది నిజం, వాళ్లింట్లో వారానికి రెండు రోజులు భోంచేసేది నిజం, తీరిక సమయాల్లో ఆమెతో చీట్లాట ఆడేది నిజం. జనం అనుకునేందు కివి చాలవు ?

గౌరీపతి సావిత్రిని సొంత తోబుట్టువులా చూస్తున్నా నంటాడు. చెల్లీ అని పిలుస్తున్నా నంటాడు. ఇది నాకు నచ్చదు. నాతోపాటు పుట్టిన ఆడపిల్లనే చెల్లీ అనుకుని నా చుట్టూ 'పరిమితి' ని కట్టుకున్న నాలాటివాడు పరాయి ఆడపిల్లని స్నేహితురా లంటాడు. గాని 'చెల్లి' అనడానికి చప్పున వొప్పుకోడు. చెల్లీ అనే దాన్లో ఉన్న పవిత్రత నేస్తురాలనే దాన్లో లేదంటే నేనొప్పుకోను. ఇదీ నా అభిప్రాయం. అయితే అంతమాత్రాన నాకు నచ్చిన కాకరకాయ పులుసు అందరికీ నచ్చాలని ఎక్కడుంది ? కొందరి కది చేదుగానూ ఉండచ్చుగదా !

ఏమైతేనేం గౌరీపతి నాకు విడ్డూరంగానే కనిపించేడు. అతని చర్యలన్నీ చిత్రంగానే ఉన్నాయి. ఒకనాడు తుకారాం ములుకుల్లాటి పలుకులు విని భయపడి సావిత్రికి ఉత్తరాలే వ్రాయకూడదని

నిర్ణయించుకున్న గౌరీపతి, ఆపిల్లా వొచ్చి ఆహ్వా నించగానే ఆ యింట్లో చేరేడు; అతి చనువుతో తిరుగుతున్నాడు.

విశ్వనాథం సావిత్రి మేనత్త కొడుకు. అతను విశాఖపట్టణంలో ఎమ్మే చదువుతున్నాడు. సెలవులకి ఈవూరొచ్చాడు. చాలా నెమ్మదస్తుడు. అమాయకుడన్నా నాకేం అభ్యంతరంలేదు. జీని యస్సులంతా అమాయకులేనని ఉదాహరణలిచ్చి గూడా అతన్ని సమర్థించగలను. బావ కాబట్టీ, బావైన తరువాత కొంత చనువుంటుంది గనుక సావిత్రి అతన్ని వేళాకోళం చేయవచ్చు. అంత మాత్రానికే గౌరీపతి సంబరపడిపోయేవాడు. తనూ అతన్ని వేళాకోళం చేయడానికి ప్రయత్నించేవాడు.

కథలు వ్రాసేవాళ్లలో నూటికి తొంభై మంది మంచి మాటకారులని ఓ మాటకారి కథా రచయిత అతని సన్మాన సభలో కళ్లజోడు తీసి మరీ చెప్పేడు గనుక ఆ థియరీ ప్రకారం గౌరీ పతి మంచి మాటకారే కావచ్చు. అవుతే ఆ మాట కారితనం విశ్వనాథం మీద కావాలని ప్రయో గించడం థియరీ చెప్పిన పెద్దమనిషి ఒప్పుకోడు.

ఓనాడు సాయంత్రం విశ్వనాథం మా రూము కొచ్చేడు. గుమ్మం దగ్గరెంతసేపట్నుంచి తచ్చాడు తున్నాడో గాని, నేను స్నానం చేసి రూములోకి వొస్తూ అతన్ని చూసేను. లోపలికి రండని పిలు స్తేనేగానీ అతనులోపలికి రాలేదు. సిగ్గుపడు తూనే వొచ్చాడు. బట్టలు మార్చుకున్నాను. ఇద్దరం చాపమీద కూర్చున్నాం. సిగరెట్టు ముట్టిం చేను. నేను చూస్తుండగా విశ్వనాథ మెప్పుడూ సిగరెట్టు కాల్చలేదు. కానీ, ఆనాడు అతనూ సిగ రెట్టు ముట్టించేడు. ఆ వాలకం చూస్తూంటే కొత్త పిచ్చనిపించింది.

"ఇది మొదటిసారిగా కాల్చడ మనుకుంటాను" అడిగేశాను. అతను తలూపి—

"అవునండీ ! మగాడు సిగరెట్టు కాల్చితేనే ప్రయోజకుడట. మీ గౌరీపతిగారు తెగ కాల్చే స్తారు" అన్నాడు దగ్గుతూ.

"అవుతే, ఇంకేం, ఇంకాస్త ప్రయోజకులు కావాలనుకుంటే నాలుగు కథలూ వ్రాయండి" అన్నాను నవ్వేస్తూ.

"నాకే గనక కథలు వ్రాయడమొస్తే రెండేళ్ల క్రితమే సావిత్రిని పెళ్లి చేసుకునేవాడిని."

నవ్వూ, జాలీ రెండూ కలిగేయి. టాపిక్ మార్చా లనే ఉద్దేశంతో—

"ఈ వేళప్పుడు హాయిగా ఇంటిదగ్గర కూర్చుని మీ సావిత్రిగారితో ఖబుర్లు చెప్పుకోక యిలా వొచ్చేశారేం ?"

"బలేవారే! సావిత్రి ఇప్పుడు మనస్తో ఎందుకు మాటాడుతుంది మాస్టారూ ? అందుకు తైమే దసలు ? మీ గౌరీపతిగారూను, ఆవిడానూ సిని మాకి వెళ్లిపోయారు."

"పోనీ .... మీరూ వెళ్లలేకపోయారు ?"

"అందుకేగా ఇక్కడికొస్తే. రండి. మనమూ వెడదాం."

అతని కేమని చెప్పాలి ? ఎలా చెప్పాలి ?

"సావిత్రివాళ్లు వెళ్లిన సినిమాకే వెడదామా?"

37 వ పేజీ చూడండి

మీరు డ్రిల్లు, లాంగ్‌క్లాత్
కొనేటప్పుడు...

# ట్విన్ టస్కర్

చిహ్నంకోసం చూడండి.



ఈ చిహ్నం
మీరు విశ్వసించదగిన
నాణ్యతకు ఇది గుర్తు.



## హార్వే ట్విన్ టస్కర్

మధురకు చేరిన హార్వేస్

డ్రిల్లు, లాంగ్‌క్లాత్

మధుర మిల్స్ ఉత్పత్తి - నాణ్యమైన నూలుకు మారుపేరు.

మధుర మిల్స్ కంపెనీ లిమిటెడ్, మధురై

మేనేజింగ్ ఏజెంట్లు: ఎ & యఫ్ హార్వే లిమిటెడ్.

# కార్యసిద్ధి

## ముద్దా చౌర్లీశబాబు

## 17

శుక్రుడు మరొక కథ మొదలెట్టాడు,

సింధురాజు సావధానంగా వింటున్నాడు—

"సత్రాజితుగారింట్లో ఏదో వస్తువు పోయిందట!—ద్వారకానగర మంతా పాక్కిపోయింది !!!— ఆయనేం, సామాన్యుడా ?—ద్వారకలో పేరు పొందిన దొడ్డ గృహస్థు, సంపన్నుడు. ఆదిత్యుణ్ణి ఉపాసించే మహాభక్తుడు. సూర్యభగవానుణ్ణి మెప్పించి, తపశ్శక్తివల్ల శమంతకమణిని సంపాదించుకున్నవాడు.

శమంతకమణి అంటే ఏమిటనుకున్నావ్ ?— ప్రపంచంలోకెల్లా అపురూపమైంది. గొప్ప మహత్తు గలది. అది ఎవళ్ల దగ్గరుంటే వాళ్లకి రోజూ నూరు బారువల బంగారం ఇస్తుంది. అటువంటి మహిమగల మణికి యజమాని అయిన సత్రాజితుకే కష్టం కలిగిందంటే, నగరం యావత్తూ అట్టుడికిపోయినట్టు ఉడికిపోతున్నారు!

ఈ వార్త వాయువేగ, మనోవేగాలతో అల్లుకుపోయింది. చెవిని పడడంతోనే వూరి పెద్దలంతా అక్కడికి వచ్చేశారు.

అసలా మణి ఎలా పోయిందంటారూ?—"

'దొంగ ఏ రూపంగా ఉన్నాడో చెప్పండి, కాస్త....

'అయినా— వారం పదిరోజుల్నించీ మన వూళ్లో దొంగలభయం ఎక్కువగానే ఉంటూంది సుమండీ. ఏదో ముఠావాళ్లు దిగారుట!—'

'ఇంతకీ, పోయేకాలం వస్తే ఎవడు అడ్డుకోగలడూ, నీ చాదస్తంగానీ.......'

—ఈ విధంగా శిరంగ నీతులతోనూ, ధర్మ వచనాలతోనూ, తలతోకా లేకుండా సాగిపోయాయి పరామర్శలు.

వచ్చిన వాళ్లందరినీ మర్యాదచేసి కూచోబెట్టాడు, సత్రాజితు. నాకంతా ఆయాసంగానే ఉంది కొంచెం ఆగాల్లే కాబట్టి అందరికీ చల్లటి పానీయాలతో ఆతిథ్యమిచ్చాడు.

'చూడండీ— మొన్నటి రోజున ఆయనగారు మా ఇంటికీ వచ్చినప్పుడే అనుమానించానామణి మీద కన్నువేసిన సంగతి, అడగ్గానే ఇవ్వాను కాదు గదా అని అంతటి పెద్ద మనిషి ఇటువంటి కుట్ర పన్నాడు. సాయంకాలం దాకానే, మంచివాడనే పేరు బుద్ధులు ఇట్టా పోతాయి కాబోలు!—' అంటూ నిండు సభలో తీరని విచారం వెల్లడించాడు, సత్రాజిత్తు.

దభీమని ఒకాయన లేచి వెళ్లి, రహస్యంగా సత్రాజితు చెవిలో, 'ఎవరండీ' ఆ మహానుభావుడూ?' అని ఆత్రంతో అడిగాడు.

'సత్రాజితుగారూ! అసలు జరిగిన విషయం మొదట్నించీ సాంతంగా చెప్పండీ, మీ మణి సంగతి నే నిమిషంలో కనిపెడతా!' అనిచెప్పి, ఒకాయన అభయమిచ్చాడు.

'ఎవరైతేనేం, పేరెందుకులెండి?— ఆయనా నలుగురిలో తల తిప్పుకుంటున్న ఘరానా మనిషే. ఈ వూరే...... ఇంకేం అడక్కండి నన్ను.....' అంటూ సగం సగం చెబుతూ, మాట మింగేశాడు సత్రాజిత్తు.

సభలో వాళ్లంతా బుజాలు తడుముకున్నారు!— బుర్రలు గోక్కున్నారు.!!—

మళ్లీ అందుకున్నాడు సత్రాజితుడు :

'మొన్న మా ఇంటికి వచ్చి శమంతకమణిని చూడాలని ఉంది అన్నాడండీ. పోనీ, పెద్దమనిషిగదా అని తీసి చూపించా. చూసి, సంతోషించి, తన మానాన తను వెళ్లొచ్చా?— వూహు. 'నేనీ వూరికి రాజుని. ఇది మాకు బహుమానంగా ఇవ్వకూడదా? అని అడగటం ఏమన్నా బాగుందా?— మీరే చెప్పండీ'

అనేసరికల్లా—

'ఓహో, శ్రీకృష్ణుడుటండీ? ఆ నల్లనయ్యా?' అని అందరూ ఏక కంఠంతో అడిగారు.

మళ్లీ ప్రారంభించాడు సత్రాజితు :

'ఎవరైతేనేం, మనం నోటితో అనుకోడమెందుకు, అసలు జరిగిన సందర్భమంతా చెప్పేస్తా. మంచి చెడ్డలు మీరే నిర్ణయించండి, పెద్దలు. మణి అడిగేసరికి 'నేనివ్వనూ' అని నిష్కర్షగా చెప్పేశా. అంతే. ఇదీ ఆ రోజు సంగతి. ఉదయం ఈ సంభాషణ జరిగింది. సాయంకాలం ఏమైందనుకున్నారూ?—

'మా తమ్ముడున్నాడే, ప్రసేనుడు— ఆ మణిని తీసుకుని సరదాకి మెళ్లో వేసుకుని, ఇంట్లో చెప్పకుండానే వేటకి వెళ్లాడుట. సమయానికి నేను లేకపోయా. ఉండిఉంటే, వాణ్ణి వస్తువు పెట్టుకు బయటికి వెళ్లనిద్దునా?— మొన్ననగా వెళ్లిన వాడు ఇప్పటికింకా ఇల్లు చేరుకోలేదంటే?—' అనేసరికి అందరూ:

'సరిసరి. నలుగుర్ని నాలుగు మూలలకి పంపించలేకపోయారూ?' అని అడిగారు ఆత్రంగా.

'పంపకేం?— పంపడం, కనబడలేదని వాళ్లు తిరిగిరావటం కూడా జరిగింది........'

అంటూ :—

'తరవాత ఏముంది, మీరే చెప్పాలి, బుద్ధిమంతులు. సంగతి సందర్భాలన్నీ విన్నారు కదా! నేనేమనుకోవాలి? చెప్పండీ! ఈ విషయం తలుచుకున్న కొలదీ మతి పోతూంది, మనస్సు వికలమైపోతూంది... ఎవరేమనుకోనీ, పాపం చుట్టుకోనీ—నాకైతే కృష్ణమూర్తిమీదే ఉంది బాగా అనుమానం. ఇది మరొకళ్ల పనికాదు. ఇంతపని ఇతరేవళ్లచేత నవుతుందండీ?—' అంటూ తీరని విచారం వెల్లడించాడు సత్రాజితు.

'బాగానే ఉంది! అయినా— సామ్యంతో పని. నగా నట్రా దగ్గిర పెద్దా చిన్నా ఏమిటండీ!' అని చెప్పి, ఒక్కొక్కళ్లే చల్లగా జారుకున్నారు. సత్రాజితు మళ్లీ ఆలోచనలోపడ్డాడు !

*　　　*　　　*

ఆనాడు— స్నేహితులతో సత్రాజితు అన్న మాటలు ఆ నోటా ఆ నోటా పాకిపోయి, శ్రీకృష్ణుడి చెవినిపడ్డాయి. 'ఏ పాపమూ ఎరగని నాకీ అపనింద ఏమిటా?' అని కృష్ణుడు అదేపనిగా యోచిస్తూ కూచున్నాడు.

అంతలో—

'హరి నారాయణ....... గోవిందా!' అనే మధుర గానం వినిపించేసరికి శ్రీకృష్ణుడు లేచివెళ్లాడు. నారదమహాముని!— అర్ఘ్య పాద్యాలిచ్చి, లోపలికి తీసుకువచ్చాడు. కూచోబెట్టాడు. తనకిప్పుడు పట్టుకుని ఉన్న విచార కారణం మహర్షికి వెల్లడించి,

'ఏమి మహాత్మా, ఈ విడ్డూరం?— ఈ నీలాపనిందకు కారణం ఏమై ఉంటుంది? త్రికాలజ్ఞులైన మీకు తెలియనిదేముంటుంది?—' అని అడిగాడు. శ్రీకృష్ణుడు.

నారదుడు, 'సరి సరి. అన్నట్టు నిన్నను భాద్రపదశుద్ధ చతుర్థి కొంపతీసి చందమామనుగాని చూశావా ఏం?' అంటూ ఎదురు ప్రశ్నవేశాడు.

'చందమామనా!— ఆఁ —అవును మహానుభావా! ఇప్పుడు గుర్తుకొచ్చింది. ఆ రోజున చంద్రుణ్ణి చూడకూడదు— అనుకుంటూనే ఉన్నాను సుమా, నారదా!— అయితేమట్టుకి యోగం ఎవడు తప్పించగలడు? నిన్న సాయంకాలం పాలు పితుకుతూంటే చెంబులో స్పష్టంగా కనబడింది చంద్రవంక! నువ్వన్నంతపనీ జరిగింది. ఇప్పుడేం దారి, మరి?'

'ఇంటికి పోతూ నిన్నను ముందుగానే హెచ్చరించి పోయానుకదా, ఎలా మరచిపోయావయ్యా ? కానీలే, చతురత కలవాడివి. ఎలా అయినా తప్పించుకోగలవు, నీకేం. కాని, నీతోపాటు మాలాంటి సామాన్యులక్కూడా ఈ నింద తప్పించుకునే మార్గం ఏదేనా ఆలోచించు, బతికిపోతాం!' అని చెప్పి నారదమహర్షి వెళ్లిపోయాడు.

*　　　*　　　*

మర్నాడు కృష్ణుడు పరివారంతోసహా అడవిదారి వెంబడే బయల్దేరాడు. వెళ్లగా వెళ్లగా ఆ అరణ్యంలో మనిషి తాలూకు అడుగుజాడలు కొన్ని అగపడ్డాయి. ఆ జాడల్నిబట్టి జాగ్రత్తగా పోగాపోగా ఒక చోటికి వచ్చేసరికి కృష్ణుడు నిస్తబ్దుడై అక్కడే నిలబడిపోయాడు !—

'అరె, ఇదేమిటి ?—ఇంతవరకూ తిన్నగా వెళుతూ ఉన్న ఈ అడుగుజాడలు ! చిందరవందరగా చెదిరి

లేయి ఉన్నాయే ? ఆ మనిషి ఎవరో అతు ఱుటు కంగారుగా పరుగెత్తి ఉండాలి !' అను కున్నాడు శ్రీకృష్ణుడు.

మరికాస్త మేరలోనే మరేవో కాళ్ల గుర్తులు కనిపించాయి. ఇవేవో జంతు పాదాలు అని నిశ్చయించుకున్నాడు, కృష్ణమూర్తి.

పోతే— అల్లంత దూరంలో ఎవరో మనిషి కింద పడిఉన్నట్టు స్పష్టంగా కనబడ్డది. గబగబా శ్రీకృష్ణుడూ, అతని వెంబడి పరివారమూ పరుగెత్తుకుని ఆ చోటుకి వెళ్లారు. అవును, నిజంగా అది మనిషి కళేబరమే !— ఆ మనిషి మరెవరో కాదు,— సత్రాజితు తమ్ముడే! ప్రసేనుడే !!— ఒంటినిండా గాయాలతో, నెత్తురు మడుగులో మునిగివుంది ఆ శవం.!— చూడగా, శరీరంమీద ఆభరణాలు లేవు, మణి అసలే లేదు !— పరీక్షగా చూశాడు కృష్ణుడు. ఆ జంతు పాదాలు సింహం పాదాల్లాగా ఉన్నట్టు తోచింది. సరే కానిమ్మని, ఆ జాడలవెంటే వెళ్లేసరికి, కాస్త దూరంలో నిజంగానే ఒక సింహం కళేబరం కనబడింది ! దానికీ ఒంటినిండా గాయాలే !

# కార్యసిద్ధి

ఎంత వెతికినా ఆ చుట్టుపక్కల ఎక్కడా మణి మట్టుకు కనిపించలే.

అయినా శ్రీకృష్ణుడు అంతటితో వదల్లేదు. మరేవో ఆనవాళ్లు అగుపించాయి. ఆ జాడల వెంబడే వెళ్లగా వెళ్లగా, అవి ఒక గుహ దగ్గరికి తీసుకు వెళ్లాయి.

గుహ బాగానే ఉంది. కాని, దాని ద్వారం మట్టుకు చాలా ఇరుకు. ఒక్కమనిషి పట్టి పట్టేటంత సందు మాత్రమే ఉంది. ఇదేమిటో చూదామని కృష్ణుడికి కుతూహలం కలిగింది. పరివారాన్ని అవతలే ఆట్టే పెట్టి; తను మాత్రం ఆ గుహ లోపలికి దూరి వెళ్లాడు.

ఆ గుహ చాలా చిత్రంగా ఉంది. ఏదో బ్రహ్మాండమైన వెలుగు అందులో కనబడుతూంది ! అది మామూలు దీపాల వెలుగు కాదు. అది తప్పక శమంతకమణి వెలుగే అయివుండాలని అనుకున్నాడు, కృష్ణుడు.



ఇంకా కొంచెం లోపలికి వెళ్లాడు. అతడ కున్నట్టుగా అది శమంతకమణి వెలుగే !!—

మణిని ఒక బంగారు ఉయ్యాలకు మధ్యని ఆ వస్తువుగా వేలాడగట్టారు ! తొట్టె లోపల ఒ పన్నెండేళ్ల బాలాకుమారి పడుకుని ఉంది. మ వెలుగులో ఆ బాలిక మాధవుణ్ని చూసింది. చిర నవ్వుతో మాధవుడు బాలికను పలకరించాడు.

'ఎవరు నువ్వు ?' అని అడిగింది, కంపిం పెదవులతో.

'నే నెవరినో చెబుతా. ముందు నీకీ మణి ఎక్క డిదో చెప్పు !' అన్నాడు, కృష్ణుడు, ఆత్రంగా.

'నువ్వు ఎవరంటే ?'—ఈసారి గట్టిగా అడిగింది

'మణి సంగతి చెప్పమంటే ?—' అని మాధవుడు

ఇద్దరూ ఇలా వాదించుకుంటూ ఉండగా, 'ఎ డపురా నువ్వు?'— అంటూ ఎలుగుబంటిలాంటి ఒక మనిషి వచ్చి కృష్ణుడిమీద కలియబడ్డాడు. అతన్ని చెలాకీగా పట్టుకున్నాడు శ్రీకృష్ణుడు.

ఇద్దరూ కుస్తీకి తలపడ్డారు. మల్లయుద్ధం ప్రారంభమయింది. కృష్ణుడు ఏమాత్రం లొంగ లేదు. అంతకంటే బింకంగా ఉంది ఎలుగుబంటి. పొద్దు గూకింది. తెల్లవారింది. పోరు ఆగలేదు. సాగుతూనే ఉంది.

మళ్లీ పొద్దు గుంకింది. తెరపిలేకుండా యుద్ధం సాగుతూనే ఉంది. ఇప్పటికి ఒకరోజు గడిచింది !

రెండు— మూడు— నాలుగు— అయిదు— ఇలా వరసని రోజులు గడిచిపోతున్నాయే కాని, యుద్ధం మాత్రం ముగియలేదు. ఇరవై రోజులు గడిచాయి.

ఇరవై ఒకటో రోజున—

మొదటిరోజు యుద్ధం ప్రారంభించినప్పుడు ఎంత హుషారుగా ఉన్నాడో, ఇరవై ఒకటో రోజున కూడా అంత ఉత్సాహంతోనూ ఉన్నాడు శ్రీకృష్ణుడు. ఎలుగుబంటి మాత్రం బాగా అలిసిపోయింది. ఇక చాలలేక, కృష్ణుడి పాదాలమీద వాలిపోయింది !!—

చిరునవ్వుతో శ్రీకృష్ణుడు దాని శరీరమంతా ఒక్కసారి నిమిరాడు ! ఎలుగుబంటికి ఎక్కడి నొప్పులు అక్కడే పోయాయి. ఏమీ జరగనట్టే అతను ఎప్పటిలాగా అయిపోయాడు.

'రామా ! జోహార్ !!—' అన్నది చేతులు రెండూ జోడించి, ఎలుగుబంటి.

'నేను రాముణ్ణి కాదు. నా పేరు కృష్ణుడు'

'నటన చేస్తావేం, దేవా ? — ఇప్పుడు నువ్వు కృష్ణుడివే. అయితే కిందటి జన్మలో శ్రీరాముడివే కదా ?— మనమంతా కలిసి తల్లి సీతమ్మను విడిపించి తెచ్చిన సంగతి మరిచి పోయావా?— అప్పుడు పట్టాభిషేక సమయంలో అందరినీ కావలసిన వరాలు కోరుకోమన్న సంగతి జ్ఞాపకంలేదా?— అందరితోపాటు నన్నూ నువ్వడి గిన మాట మరిచేపోయావా ?

'పోనీ, ఇప్పుడు గుర్తు తెచ్చుకో—అందరిలాగా కాకుండా నే నొక పిచ్చి వరం కోరుకున్నా, నీతో యుద్ధం చెయ్యాలని. అప్పుడు నువ్వు నవ్వావు కాదా ?—

'అలాగే, తప్పకుండా నీ కోరిక తీరుస్తాను. అయితే, ఈ అవతారంలో కాదు. నేను మళ్లీ అవ తారం ఎత్తిందాకా ఉండాలి ....' అంటూ అభయ మియ్యలేదా ?— ఈనాటికి నా కోరిక తీరింది. ధన్యుణ్ణి !!—' అన్నా డతను.

అప్పుడు శ్రీకృష్ణుడు 'జాంబవంతా !— భక్తుడవైన నీ దగ్గరికి రాగానే నా కోరికా తీరింది. మాయమైన మణి దొరికింది. నాపైన పడిన నీలాపనిందను తొలగించుకోటానికి వీలయింది. నే వచ్చిన పని సఫలం చేశావు. అదే పదివేలు !' అన్నాడు శ్రీకృష్ణుడు, అమిత ఆదరంతో.

'రామచంద్రా ! తప్పకుండా మణి తీసుకో. అయితే, మరొక చిన్న కోరిక నాది ....' అన్నాడు జాంబవంతుడు.

'చెప్పవోయ్ జాంబవంతా !—నీ కోరిక తీర్చడం కంటే నాక్కావలసిందేముంది ?' అన్నాడు, శ్రీకృష్ణుడు.

జాంబవంతుడు కృష్ణుణ్ని బంగారుతొట్టి దగ్గరకు తీసుకువెళ్లాడు.

'కృష్ణా !—వస్తూనే నువ్వు పలకరించిన బాలామణి నా ముద్దుల కూతురు—జాంబవతి. ఆమె ఆటకోసమే ఈ శమంతకమణిని తొట్టికు కట్టాను. ఇప్పుడీ మణితోపాటు నా బాలామణిని కూడా నీ చేతుల్లో ఉంచుతున్నాను. నువు స్వీకరించి నాకు అల్లుడవు కావడమే నా కోరిక ...!' అంటూ, మణినీ, కుమార్తెనూ కృష్ణుడికి సమర్పించాడు !

"సత్రాజితు సంగతి ఏమయింది ?" అని అడిగాడు, సింధురాజు.

"ఆ కథే చెబుతున్నాను రాజా !—విను" అని శుక్రుడు మళ్లీ కథలోకి దిగాడు.

## 18

ఇప్పుడు ద్వారకానగర మంతటా మరొకవార్త అల్లుకున్నది—శ్రీకృష్ణుడు మణిని తెచ్చాడట ! మణితోపాటు ఎవరో అమ్మాయిని కూడా వెంట బెట్టుకు వచ్చాడట !!—

ఇంటికి చేరుకోగానే శ్రీకృష్ణుడు అతి వైభవంగా వినాయకపూజ కని గొప్ప ఏర్పాట్లు చేశాడు. పూజకోసం ఇరవై ఒక్క రకాల పువ్వులు, ఇరవై ఒక్క రకాల పత్రులు, నివేదనకు ఇరవై ఒక్క రకాల పిండివంటలు, సిద్ధమయ్యాయి. వూళ్లో పెద్దలందరికీ పిలుపులు వెళ్లాయి. సత్రాజితుకి ప్రత్యేకించి ఆహ్వానం వెళ్లింది !

అంతా వచ్చేశారు. పూజా పునస్కారాలు జయప్రదంగా జరిగిపోయాయి. అప్పుడు మహాసభలో శ్రీకృష్ణుడు తనపైన వచ్చిపడిన నీలాపనింద కథను, కథ కంచికి వెళ్లిందాకా వినిపించాడు.

తరువాత ఎంతో మర్యాదగా సత్రాజితును వేదికమీదికి ఆహ్వానించాడు :

'సత్రాజితుగారూ !—నేను దొంగిలించానని మీరు అపోహ పడుతున్న మీ శమంతకమణి ఇదుగో! —తీసుకోండి !!' అంటూ, పెద్దలందరి యెదటా శమంతకమణిని ఆయన చేతులో ఉంచాడు.

వాలిపోయాడు పెద్దమనిషి సత్రాజిత్తు, శ్రీకృష్ణుడి పాదాలమీద పడి వేవిధాల క్షమాపణ చెప్పుకున్నాడు :

'దయామయా !—ఆపద్బాంధవా !—శ్రీకృష్ణ పరమాత్మా !—శరణు, శరణు !—జాంబవంతుడి కోరిక తీర్చి అతన్ని ధన్యుణ్ని చేశావు. నాకు కూడా తరుణోపాయం చూపించవా ? నా కోరిక తీర్చవా ?' అని ప్రాధేయపడ్డాడు.

'ఏం కోరిక మహాత్మా !—మళ్లీ అడవులకుగాని వెళ్లవలసి ఉంటుందా ?' అని అడిగాడు కృష్ణుడు.

అందరూ పకపక నవ్వారు.

'నువు వెళ్లవలసిన పనిలేదు. నా కూతుర్ని నీ చేతులో ఉంచి నేనే అడవులకు పోదలిచి ఉన్నాను. ఇంతగా కష్టపడి తెచ్చుకున్న శమంతకమణిని నువ్వే అట్టే పెట్టుకో. దానితోపాటు నా ముద్దుల కూతురు సత్యభామను పెళ్లాడు ! ఇదే నా కోరిక !!' అన్నాడు, సత్రాజితు.

అందరూ జేజేలు కొట్టారు.!

అప్పుడు శ్రీకృష్ణుడు సత్రాజితుతో—'భక్తుడి కోరిక తీర్చడం విధి కనుక, మీ అమ్మాయిని చేసుకుంటాను కానీ, ఈ మణి మాత్రం నాకు వద్దు. ఇప్పటికే ఇది ఇద్దర్ని మింగింది. నన్ను అడవులకు తరిమింది. చాలు, చాలు ! దీన్ని మీరే ఉంచుకోండి !' అని చెప్పాడు.

అంతా పొట్టలు చెక్కలయ్యేలా నవ్వారు.

### బహుమతి

బావ వచ్చాడమ్మా
బాతు బొమ్మ తెచ్చాడమ్మ
అక్క వచ్చిందమ్మా
లక్క పిడతలు తెచ్చిందమ్మ

అన్న వచ్చాడమ్మా
చిన్న గౌను తెచ్చాడమ్మ
వదిన వచ్చిందమ్మా
ఓనమాలు బొక్కు తెచ్చిందమ్మ

మామ వచ్చాడమ్మా
ఏమీ తేనే లేదమ్మ;
ఎత్తుకుని నన్ను
ముద్దు పెట్టుకున్నాడమ్మ!

ఎ. వి. రంగయ్య

అప్పుడు ద్వారకావాసులు శ్రీకృష్ణ భగవానుడికి నమస్కరించి, 'మహానుభావా !— అక్కడ జాంబవంతుణ్ని, ఇక్కడ సత్రాజితునీ కోరికలు తీర్చి, తరింపజేశావు. ఒకేసారి ఇద్దరు సతీమణులను సంపాదించుకున్నావు. బాగానే ఉంది. మరి ఈ సంతోష సమయంలో మాలాటివాళ్లకు ఏ వరం ప్రసాదిస్తావు ?' అని అడిగారు.

అప్పుడు శ్రీకృష్ణుడు—

"మీ కివ్వకపోవడ మేమిటి ?— లోగడ నారద మహామునివల్లనే నొక సంగతి విన్నాను. మీకూ చెబుతా వినండి.

ఒకప్పుడు విఘ్నేశ్వరుడు విందుమీద విందూ, విందు మీద విందూ ఆరగించి, నెమ్మిగా కైలాసం చేరుకున్నాడు. గుమ్మడికాయలాంటి ఆ పెద్ద బొజ్జతో తలిదండ్రులయిన పార్వతీ పరమేశ్వరులకు సాష్టాంగ నమస్కారం చేదామని ముందుకు వాలాడు. బొజ్జ భూమిని ఆనింది !—కాళ్లు రెండూ తలిపోయాయి !!—

ఇది చూసి శివుడి సిగలో ఉన్న చందమామ పకపక నవ్వాడు.

ఈలోగా—

బొర్లా పడ్డ వినాయకుడి, బొజ్జ పగిలి, అందులో ఉన్న ఉండ్రాళ్లూ, పిండివంటలూ కైలాస మంతటా దొర్లాయి !—తక్షణమే అశ్వినీదేవతలు దిగివచ్చారు. పదార్థాలన్నీ మళ్లీ గణపతి పొట్టలో సర్దారు. నాగలోకంనించి పదివేల పాముల్ని తెప్పించి, వాటితో వినాయకుడి పొట్ట కుట్టారు.

తన ముద్దుల బిడ్డమీద రాజదృష్టి పడినందుకు పార్వతీదేవి ఉగ్రురాలైంది !—అశ్వినీ దేవతలు వసివాణ్ని బతికించినా పార్వతికి కోపం తగ్గలేదు.

తన చిన్నారి గణపతిని చిన్నబుచ్చిన చందమామను దేవి తీవ్రంగా శపించింది !—నాటినించీ చంద్రుణ్ని చూసినవాళ్లకి నీలాపనిందలు తప్పటం లేదు !—

"నన్ను జాగర్తగా ఉండమని నారదమహర్షి ముందుగానే హెచ్చరించాడు సుమండీ!— కానీ, కథ వేరేలాగ జరగాల్సి ఉండగా నారదుడు చెప్పిన మాట నాకెలా జ్ఞాపక ముంటుంది ?—పాలచెంబులో నేను చంద్రుణ్ణి చూడటం, అంతమాత్రానికే నీలాపనిందలు రావటం—ఈ కథంతా సొంతం విన్నారుకదా !—నాలాగా మీకు ఈ నీలాపనిందల బాధలేకుండా తప్పిస్తాను.

భాద్రపద శుద్ధ చవితినాడు వినాయకుడు పుట్టిన రోజు. ఆనాడు విఘ్నేశ్వరుడ్ని పూజచేసి, ఆయన చరిత్ర చెప్పి, తరవాత నే ననుభవించిన ఈ నీలాపనిందల కథను చెప్పుకుని కథాక్షతలు వేసుకున్న వాళ్లకు నీలాపనిందల భయం ఎంతమాత్రం ఉండదు. ఇదే సమస్త లోకాల ప్రజలకూ నే నిస్తున్న వరం" అని చెప్పి అక్కడ సమావేశమైన అందరకూ శ్రీకృష్ణుడు స్వయంగా అక్షతలిచ్చాడు!— వాటిని భక్తితో పుచ్చుకున్నారు. తరవాత ప్రసాదాలతో సహా ఎవళ్ల ఇళ్లకు వాళ్లు చేరుకున్నారు.

"చూశావా రాజా!— తనని ఉపేక్షించినవాళ్లని వినాయకుడు ఎంతలేసి తిప్పలు పెడుతున్నాడో ! —సాక్షాత్తు శ్రీకృష్ణపరమాత్ముడే నీలాపనిందలు పొంది, అడవులపాలయి, కష్టాలు అనుభవించక తప్పిందికాదు!— సామాన్యుల సంగతి ఇక చెప్పేదేమిటి?— ఇటువంటి ఆ విఘ్నేశ్వరుడే విన్ను భయపెడుతున్నవాడు!—" అని శుక్రాచార్యుడు కథ పూర్తిచేసేటంతలో ఒక సేవకుడు అక్కడికి వచ్చాడు :

"మహారాజా !— చంచలాసురుడట. తమ దర్శనంకోసం వచ్చి కనిపెట్టుకుని ఉన్నాడు" అని చెప్పాడు.

"సరి ప్రవేశపెట్టు" అన్నాడు, సింధురాజు.

చంచలుడు వస్తూనే మహారాజుకి నమస్కరించి, "ప్రభూ !—గణపతి అనే బాలుణ్ని చంపటానికి తమరు బ్రహ్మప్రయత్నాలు చేస్తున్నారని విన్నాను. నాకు నేనయి చెప్పుకోగూడదు కానీ, నేను సమస్తమైన దేవదానవ విద్యల్లోనూ మేటిని. ఎటువంటివాళ్లయినా నా చేతులో చిత్తుగాక తప్పదు, అటువంటప్పుడు అభమూ, శుభమూ

56వ పేజీ చూడండి

## వ్రతములలోకెల్ల ఉత్తమ వ్రతమని శివుడు పార్వతికి!

# వరలక్ష్మీవ్రతం



వరలక్ష్మీపూజనాడు గృహిణి కలశాన్ని ఏర్పాటు చేస్తున్న దృశ్యం.



చేతికి 'తోరం' కడుత

ఆకాశం ముసురుకున్నా, వానలు చిరెల్ల, విసవిసలతో కళకళలతో కురుస్తూవున్నా, శ్రావణ మాసం కనులపండువుగా వుండే నెల. పౌర్ణమి ముత్తయిదువుల, కన్నె పిల్లల-పట్టు మికి ముందు వచ్చే శుక్రవారం వరలక్ష్మీవ్రతం (ఈసారి 21వ తేదీ) దక్షిణాదిన; తెనుగునాట స్త్రీలందరూ భర్తల మేలుగోరి వారికి లక్ష్మీ ప్రసన్నురాలు కావలెనని యీ వరలక్ష్మీవ్రతం చేస్తారు.

శివుడు పార్వతితో ఇటువంటి వ్రతం చెప్పిన కటికి 'కుండిన నగర వాస్తవ్యురాలైన చారుమతి— వరలక్ష్మీదేవి స్వప్నమున అగుపించి చెప్పినందున— చేసి సకల ఐశ్వర్యాది యిష్టసిద్ధిని పొందినదని' చెప్పినట్లు ప్రతీతి.

వరలక్ష్మీదేవిని ఇళ్లాళ్లు ముగ్గులతో, తోరణాలతో ఇళ్ల నలంకరించి, కొత్త బియ్యం పట్రి యుగుళ్లు, గల కలశంమీదకు ఆవాహన చెప్పి ఆనాడు పూజ చేస్తారు.

ప్రచారంలో ఉన్న మరొక కథ ఏమంటే పార్వతియే ఒకసారి శాపవశమున చారుమతియై ఇల జన్మించిందనీ, ఆమె తన ప్రాణవల్లభుని చేరే నిమిత్తం తపస్సు చేయగా విష్ణుమూర్తి సాక్షాత్కరించి "తల్లీ! నీవు వరలక్ష్మీ ప్రసన్నతను 'పొందు'" మని చెప్పెనట. చారుమతి లక్ష్మీదేవిని తన తపస్సుచేత మెప్పించగా ఆమె తన ఏడు వారాల నగలతో ప్రత్యక్షమై "నీవు నన్ను కలశముపై ఆవాహనము చేసుకొని వ్రతము చేయుము" అని చెప్పినదట. చారుమతి శ్రావణ పౌర్ణమికి ముందు



పాముపుట్టకు పూజచేసి పాలుపోసి హారతి ఇస్తున్న దృశ్యం.

చెప్పిన



...న్న దృశ్యం.

...క్రవారంనాడు మొట్టమొదట ఈ వరలక్ష్మీ... చేసింది.

...మ తమ ప్రాణేశ్వరుల మేలు ... యిష్టకామ్యార్థసిద్ధి కోసం ... ఆ తర్వాత యీ వ్రతాన్ని ...నే వస్తూన్నారు. చేతికి తోరం ...సుంటున్నారు.

...స్త్రీ నమ్మవాయనం పుచ్చుకొంటి నమ్మా ...ం" అని ఇళ్లూ వాకిళ్లూ కళకళ లాడి...రు. బహుళ ప్రచారంతో ఉన్న ఈ వ్రతాన్ని ...ంచడంకన్న ఇక్కడ విపులంగా చెప్ప...దనుకుంటున్నాము..

## గరుడపంచమి

...త్తరాదిన నాగపంచమిగా ...ాదిన గరుడ పంచమిగా ...స్తికెక్కిన శ్రావణశుద్ధ పంచమి ...ని జన్మదినం.

...డు తన తల్లికి దాని నచెర తప్పించిన ...ంగా ఆరోజు స్త్రీలు ముఖ్యంగా అన్న...న్న పడుచులు ఈ వ్రతం చేస్తారు. ...గాని గడ్డికట్టి ఇంట్లోగాని నాగదేవతకు ...య్యడం పుట్ట 'బంగారం' (మన్ను) చెవుల...వం—అన్నదమ్ములకు ప్రసాదం ఇవ్వడం—మేలు కోరి యీ వ్రతం చెయ్యడము ...న్న, ఉత్తరాదిన అనవాయితీగా వస్తోంది! ★

# నరకానికి ప్రయాణం!

## కథనం డెరెక్ ఈవ్

### 3

ఈ వ్యాసం వ్రాసే నాటికి ... సరిగ్గా మూడు వారాల క్రితం ... శ్రీమతి ఇవిలిన్, ఆమెపిల్లలూ ఒకానొక పాకిస్తానీ కుగ్రామంలో సంరక్షణ కోసమూ, బ్రతికి బయట పడేందుకూ పెనుగులాడుతున్నారు. వాళ్లు తింటూవుండే చాలీచాలని ఆ ఆహారం వల్ల వారు బలహీనులయారు, అనారోగ్యానికి గురికాక తప్పలేదు, పూర్తిగా శుష్కించిపోయారు.

ఆ కుగ్రామపు బాధాకరమైన వాతావరణం నుంచి, వారిని నేను రక్షించినతరువాత, ఈనాడు మన్చెస్టర్‌లోని సెంగాం లోనే శ్రీమతి ఇవిలిన్ పిల్లలతో ఉంటున్నది. ఒక రోజున అక్కడికి నే వెళ్లాను. ఎంతో ఆశ్చర్యంవేసింది, వారిని చూసేసరికి. మూడు వారాల్లోనే, మంచి పుష్టికరమైన ఆహారం, వైద్య సదుపాయాలు వారిలో ఎంతో మార్పును తెచ్చాయి. కొన్నాళ్లక్రితం నేను అడవుల్లో చూచినది వీళ్లనేనా అనిపించేటంతగా మారిపోయారు.

అంతటి మార్పు వచ్చినా, శ్రీమతి ఆలం ముఖంమీద ఆమె అనుభవించిన బాధల ఛాయలు ఎలా మాసిపోతాయి! అందుకే కాబోలు, ఆమె వయస్సు 37 సంవత్సరాలే అయినా, చూడటానికి 50 ఏళ్ల స్త్రీలా కనిపించింది.

ఈనాడు ఆమె నిండుగా నవ్వగలుగుతుంది. ఆ ముగ్గురు పిల్లలు మునుపటి దీనస్థితినుంచి విముక్తిపొందారు. వారిలో, అనాటి కష్టాల ఛాయలు మాసిపోయాయి.

ఐదేళ్లపాటు పాకిస్తానీ గ్రామం సదర్ఘాట్‌లో అనుభవించిన నరకయాతనను మరిచిపోవటానికి శ్రీమతి ఆలం ప్రయత్నించవచ్చును.



చాలా కాలం కష్టాలు అనుభవించిన తరువాత, శ్రీమతి ఆలం, తన సోదరుడయిన విలియం డేవిస్‌ను కలిసికొన్న దృశ్యం. ప్రక్కన వున్న

తనకు అక్కడ ఎంతో మేరవి భూములున్నా యని చెప్పిన భర్త మాటలను నమ్మి, ఆమె అక్కడికి తన పిల్లలతో వెళ్లగలిగింది.

అక్కడవున్న పూరి కొంపలే తన భర్తకుగల "మంచి భూములనీ" ఆ పూరిల్లుకూడా నాగరికతకు 40 మైళ్ల దూరాన ఉన్నదనీ, తను దారుణంగా మోసపోయిందని.....ఆమె ఎలా తెలిసి

## నరకానికి ప్రయాణం

కోగలిగింది? ఆ కుగ్రామంలో, దారుణమైన పరిసరాల నడుమ ఆమెభర్త తనను ఎలా వదిలి వేయగలిగాడు? పిల్లలిద్దరు కలరా వాతబడి ఎలా కన్ను మూశారు? తిరిగి బర్మింగ్‌హాం వెళ్లేందుకు తన భర్త తనకు డబ్బు పంపనందున, తను అక్కడే ఎలా ఖైదీగా ఉండిపోగలిగింది?

ఇదీ కథ :

పదిహేను నెలల క్రితం, ఆమెభర్త లాల్, ఎలాగయితేనేం, ఆ గ్రామానికి వచ్చాడు. నిజం చెప్పాలంటే, తాను పూర్తిగా బందీగా తయారయింది ఆ క్షణంనుంచే!

సహాయాన్ని అర్థిస్తూ ఆమె తన సోదరుడు

# యదార్థ విచిత్రగాథలో చివరిభాగం

విలియం డేవిస్ కు వ్రాసిన ఉత్తరాలను దోవలో ఆమెభర్త లాల్ దాచేవాడు, వాటిని గమ్యస్థానానికి వెళ్ళనిచ్చేవాడుకాడు. ఈవిధంగా ఇతరుల సహాయం కోసం చేయి చాపిన ఆమెను, ఎన్నోసార్లు చావ బాదాడు!

తనభర్త, తనను చూడటానికి ఆ గ్రామం వచ్చినప్పుడు, ఆ కలయికను గురించి చెప్తూ, శ్రీమతి ఆలం భయంతో వణికిపోయింది. ఆమె ఇలా చెప్పింది :

"నా భర్త ఇక్కడకు వస్తున్నట్లు, ఆయన సూయజ్ లో పోస్టుచేసిన కార్డుద్వారా, తొలిసారి తెలిసింది. ఆయన వస్తున్నాడంటే నాకు భయం వేసిందనే చెప్పాలి. కారణం నాకు తెలుసు— నన్ను సదర్‌ఘాట్‌లోనే ఉంచటానికి ఆయన విశ్వ ప్రయత్నంమూ చేస్తాడు.

ఆకలితో అలమటించిపోతున్న మా కోసం, మా తిండికోసం కొంత డబ్బు తెస్తాడని ఎదురు చూశాం. కాని మా ఆశలు నిరాశలు అయ్యాయి.

మూడు వారాల తర్వాత ఒకనాడు లాల్ ఇంటికి వచ్చాడు. వస్తూ, తనతోపాటు తనకున్న ఆస్తి నంటినీ ఒక సూట్‌కేస్'లో తీసుకువచ్చాడు. డబ్బు పెద్దగా ఏమీ తీసుకురాలేదు— కొద్ది షిల్లింగులు మాత్రం పట్టుక వచ్చాడు.

నిరాశతో, కుప్పగా కూలిపోయాను. కన్నీరు కాల్వలై ప్రవహించేలా ఏడ్చాను. ఈ ఘోరాన్ని సహించలేక ఆయనమీద విరుచుకపడ్డాను. తిట్టాను...తన కుటుంబానికి ఏమాత్రమూ సహాయం చేయనందుకు.

"ఇద్దరు పిల్లలను నువ్వే చంపావు!" బిగ్గరగా అరిచాను. "సుఖ సౌఖ్యాలలో తులతూగవలసిన నన్నూ, నా పిల్లలను తెచ్చి ఈ నరకంలో పడ వేశావు!"

నా ఆరోపణలను అతను ఎక్కువసేపు సహించ లేకపోయాడు! కాగా, నన్ను అమానుషంగా ముందుకు లాగి, కిందకు పడవేశాడు.

రానున్న 14 మాసాలలో ఎలాంటి జీవితాన్ని అనుభవించవలసి వుంటుందో... ..ఈ కొద్ది క్షణాల కాలంలోనే ఆయన నాకు చవిచూపాడు.

ఆ సమయంలో ఆయన్ను నేను ఏమాత్రం ఎదిరించినా, ఆయన నన్ను ఇంకా చితుకబాదేవాడు!

'ఆత్మత్యాగం'తో అన్ని మహమ్మదీయ నియ మాలకు కట్టుబడి ఉండటం నాకు తప్పలేదు.

"అంతవరకూ ఒక పూట అయినా దొరికిం దేదో తింటున్న మేము, ఆనాటినుంచి చాలా రోజులవరకు అన్నంచూడని సంఘటనలు చాలా వున్నాయి" అన్నది శ్రీమతి ఆలం.

అంతటితో ఆగలేదు శ్రీమతి ఆలం అనుభ వించిన కష్టాలపరంపర. ఆలం ఆమెను ఇంకా బాధలుపెట్టాడు. రెండో పెళ్ళికూడా చేసుకున్నాడు. మహమ్మదీయ నియమం ప్రకారం అతనికి ఆ హక్కు వున్నా, అందువల్ల శ్రీమతి ఆలం ఇంకా నష్టపోయిన మాట మాత్రం వాస్తవం. ఆమె ఇలా అంది :

ఆయన ఎంచుకున్న పిల్ల చిన్నదే. వయస్సు 20 సంవత్సరాలుంటాయి. అందంగానే వుంటుంది. కానీ ఆమెకు అంతకుముందు ఆరుసార్లు పెళ్ళి అయింది. మహమ్మదీయులలో విడాకు లిచ్చుకోవటం, మళ్లీ పెళ్లిళ్లు చేసుకోవటం తేలిక. "నీకు విడాకులిస్తున్నాను" అని మూడుసార్లు అంటే చాలు, ఎక్కడి సంబంధాలు అక్కడ తెగిపోతాయి.

ఆలం, ఆ పిల్లను పెళ్లిచేసుకునే ముందు నన్ను అడగవలసి వచ్చింది. కాని, నేను ఈ పెళ్లికి సమ్మ తించలేదు. ఎంత బాదినా నేను ఒప్పుకోలేదు. చివ రకు, అతను నా మొరను, నా ప్రతిఘటననూ లెక్క చేయకుండా వెళ్లిపోయాడు.

పెళ్లి అయిపోయింది. నాకు కొత్త యాతన ఎదురయింది. ఇకముందు, నా భర్తకు తోడు, ఆయన పెళ్ళాడిన అమ్మాయికి కూడా చాకిరీ చేయవలసి వస్తుందని నాకు తెలుసు.

అందుకే, నన్నూ, నా పిల్లలను మరోవూరింట్లో ఉండనివ్వమని అడిగాను. ఆయన నా మాట వింటేగా? పైగా, భర్తగా తన హక్కులను వాళ్లవేశాడు.



వ్యాసకర్త 'డెరిక్ యీవ్'తో పాటు శ్రీమతి ఆలం పిల్లలు పాకిస్తాన్ నుంచి లండన్‌కి హాయిగా వెళ్తున్నారు.

అందువల్ల, రాత్రిళ్ళుకూడా అతనితో, అతని కొత్త భార్యతో ఆ పాడు కొంపలోనే వుండక తప్పింది కాదు.

సంప్రదాయబద్ధమైన క్రైస్తవ కుటుంబంలో పెరిగిన నాకు ఇదంతా దుర్భరమని తోచింది. ఆలం అన్నా, అతని కొత్త భార్య అన్నా నాకు మరీ అసహ్య మని అనిపించింది.

అతను గ్రామానికి రాకముందే నా జీవితం కొంత మెరుగనికూడా అనిపించిన క్షణాలు లేక పోలేదు"..........

ఇలాంటి దుర్భరమైన వాతావరణంలో శ్రీమతి ఆలం తన జీవితాన్ని గడిపింది. ఆ ఒక్క గ్రామంలోనే ఆమె జీవితంలో అనుభవించవలసినంత విషాదాన్ని, దుఃఖాన్ని అనుభవించింది. ఆ గ్రామా నికి వచ్చీ రాకముందే, ఇద్దరు పిల్లలను పోగొట్టు కోవటం, మరీ దుఃఖమనిపించింది, ఆమెకు.

ఈ సంగతి ఆమె నాతో చెపుతూ, ఎంతగానో ఏడ్చింది. "మా ఫరీదా... ఏడేళ్ళుకూడా నిండలేదు.... ఆ అర్ధరాత్రి కలలా తిరిగింది. అది కలలా అని తెలుసు. ఈచావు తప్పనిదని అనితెలుసు. పైగా, ఫరీదాకుకూడా తను చనిపోతున్నట్లు తెలుసునుకుంటా. తెల్ల వారేసరికి ఫరీదా మరీ బలహీనమైంది. తెల్లవారిన తరువాత, నా కళ్లవెంట నీరు రావటం ఫరీదా చూచి, "అమ్మా ఏడవ్వద్దు, ఏడవ్వద్దు" అంది.

పాపం ఫరీదా! పాకిస్తాన్‌లో తల్లులు పిల్లలకు చేసిపెట్టే తియ్యటి 'లొల్లిపాప్‌లు' తనకూ కావాలని అడిగింది. మరో సమయమైన అయితే నేను ఒప్పుకొనేదాన్ని కాను!

కాని ఇప్పుడు సరేనక తప్పలేదు. పెద్దవాడు హమీద్ బజారుకెళ్లి నాలుగు "లొల్లిపాప్‌లను" పట్టుకొచ్చాడు.

ఫరీదా కాస్సేపు చేత్తో పట్టుకొంది. తరువాత మళ్లీ నాకే ఇచ్చి : "నా కొద్దులే అమ్మా! వాటిని హమీదుకు, హలీమాకు ఇచ్చేయ్" అంది.

తరువాత గంటసేపటికి ఆ అమ్మాయి కన్ను మూసింది. దాదాపు 24 గంటలసేపు నిద్ర పోలేదు నేను. రెండు రోజులక్రితమే ఈ లోకంలోకి వచ్చిన పసిపాపాయి సంగతే మరిచాను.

సరే! ఆ పసివాణ్ణయినా రక్షించుకొనేందుకు నా ప్రయత్నాలు ప్రారంభించాను. అటువంటి దారుణమైన పరిస్థితులలో..... ఈ పనిచేయటం కూడా అంత తేలికకాదు!

మేము ఉపయోగించే నీటిని 15 నిమిషాల సేపు మరగబెట్టేదాన్ని. కారణం అది చెరువు నీరు. ఆ చెరువు నీటిని త్రాగేవాళ్లు త్రాగుతుంటే, అక్కడే కొందరు గుడ్డలు ఉతుకుతూ వుంటారు. అందువల్ల ఆ నీటిని ఉపయోగించేటప్పుడు, జాగ్రత్త గానే వుండటం మంచిదనిపించింది.

ఇంత జాగ్రత్తపడ్డా, కలరావల్ల పాపాయి కూడా మరణించింది.

ఆ రోజు బుధవారం! పాపాయిలో అనారోగ్య లక్షణాలు కనుపించింది ఆ రోజునే మర్నాడు, గురువారం రాత్రికే ఆశలు వదులుకోక తప్పలేదు. శుక్రవారంనాటికల్లా, పాపాయి మా దగ్గరలేడు... ఫరీదాతోపాటే వెళ్ళిపోయాడు.

## నరకానికి ప్రయాణం

పిల్లలో చిన్నది హలీఫా, కాలికి నొప్పిగా వుందని అన్నది ఒకరోజు. క్రమేణా తుంటి భాగాన కురుపు లేచినట్లు అర్థమైంది. ఆ గ్రామంలోనుంచి హలీఫాను ఢక్కాకు తీసుకెళ్ళవలసి వచ్చింది. ఢక్కా వెళ్ళటానికి డబ్బుల్లేవు. బస్సు ఖర్చులకు, ఎవరి దగ్గరో అప్పుగా తీసుకున్నాను. నా క్కావల సిందల్లా రెండు పౌనులే. దానికోసమే నేను దాదాపు 40 మంది దగ్గరా బిచ్చమెత్తవలసిన స్థితిలో ఉన్నా రక్కడి ప్రజలు.

ఆస్పత్రికి వెళ్ళాక మరో కలతచెందిన వార్త విన్నాను. హలీఫాకు క్షయ ముదిరిందట. అందువల్ల జీవితాంతం కుంటిదై పోవాలన్నారు!

అందువల్ల ఆ అమ్మాయి 18 నెలలపాటు 'ప్లాస్టర్' ధరించవలసివచ్చింది. హలీఫా ఎక్కడికి వెళ్ళాలన్నా నేనే మోసుకుని వెళ్ళేదాన్ని. పైగా, ప్రతి ఆరువారాలకు కట్టు మార్పించేందుకు "సిల్హెట్ వెళ్ళేదాన్ని. సిల్హెట్ వెళ్ళాలంటే 12 మైళ్ళు నడవాలి. హలీఫాను తీసుకుని అక్కడినుంచి బండిలో 45 మైళ్ళ దూరంలో వున్న హబీగంజ్ వెళ్ళాలి.

బర్మింగ్‌హాంలో వున్న నా భర్తకు ప్రతివారం ఉత్తరం వ్రాసేదాన్ని. పన్నూ, నా పిల్లలకు— నా కోసం కాకపోయినా, నా పిల్ల హలీఫాకోసమైనా— అక్కడకు తీసుకుపొమ్మని. కాని, ఇవేవీ ఆయన చెవులకు ఎక్కితేగా !

కాకపోతే, నేను సిల్హెట్ వెళ్ళటానికి, ఆయన ఎప్పుడో కొద్ది పాటి డబ్బు పంపేవాడు.. ఆయన చేసిందల్లా అంతే." అని తన గాధను శ్రీమతి ఆలం నాకు చెప్పింది.

1962 జనవరిలో శ్రీమతి ఆలంకు తన 'ఖైదు నుంచి తాత్కాలిక విముక్తి లభించింది. ఆమె ఒక రోజున సిల్హెట్ వెళుతున్న సమయంలో, జూనియర్ స్కూల్‌లో ఉపాధ్యాయిని వృత్తి దొరికింది. పాకిస్తాన్‌లోని అధికారభాష అయిన ఇంగ్లీషు వచ్చిఉండటమే ఆమెకు గల యోగ్యత.

ఉద్యోగం దొరకగానే, ఆమె తన పిల్లలతో సహా సిల్హెట్ వచ్చి కొంత నుంచి జీవితాన్ని రుచిచూడ గలిగింది.

కాని, హలీఫా తిరిగి ఆస్పత్రికివెళ్ళవలసిన అవసరం రావటంతో ఈ కొత్త అధ్యాయం కూడా ముగిసింది. దానికి కారణం ఏమంటే—పాకిస్తాని ఆస్పత్రుల్లో సరియైన సౌకర్యాలు లేవు. రోగుల దగ్గర వారి బంధువులే ఉండి చికిత్స చేస్తూ ఉంటారు. శ్రీమతి ఆలం కూడా అదే చేయవలసి వచ్చింది— అందువల్ల ఉద్యోగం పోయింది.

హలీఫా ఆస్పత్రినుంచి రాగానే, శ్రీమతి ఆలం సహాయం కోసం ఢక్కాలోని బ్రిటీష్ హైకమిషన్‌ను కోరింది. తిరిగి తన పిల్లలతో ఇంగ్లండు వెళ్ళి పోయేందుకు అవసరమైన డబ్బు అప్పుగా ఇవ్వమని కోరింది. తాము డబ్బు ఇవ్వలేమని హైకమీషన్‌వారన్నారు.

దీనికి బదులు, ఆమె తిరిగి సదర్‌ఘాట్ వెళ్ళేందుకు 37 రూపాయిలిచ్చారు.

ఆమె బ్రిటీష్ హైకమీషన్ సహాయం కోసం మళ్ళీ ప్రయత్నం చేసింది. ఉత్తరం వ్రాసింది. ఫలితం?........? ఇంతలో తనభర్త తిరిగివచ్చాడు. అంతేకాదు, బ్రిటీష్ హైకమీషన్ సహాయాన్ని అర్థిస్తూ ఆమె ఢక్కాకు వ్రాసికొన్న ఉత్తరం పోస్టుచేసేందుకు వెళ్ళిన వ్యక్తి, ఆ ఉత్తరాన్ని తన భర్తకే ఇచ్చాడు. ఆ ఉత్తరాన్ని చదివిన ఆలం ఆమెను నిర్దాక్షిణ్యంగా కర్రతో కొట్టాడు. నెత్తురు కూడా వచ్చింది. ఇంకా ఆమె ఇలా చెప్పింది :

"ఆ మరునాటి ఉదయం ఆ ఊరి మంత్రగాడైన డాక్టరు నన్ను చూడటానికి వచ్చాడు. ఆ సమయంలో నా భర్త పొలాల్లోకి వెళ్ళాడు. ఆ మంత్రగాడు వచ్చి ఏదేదో చేశాడు. ఆకులు మార్చాడు. కాకి ఈకలు కలిపాడు. ఇదంతా నా గాయాలు నయం అయేందుకట ! నేనేం మాట్లాడలేదు. ఇదంతా పట్టించుకొనేందుకు, నాలో శక్తి కూడా లేదు, ఆసమయంలో.

సరియైన సహాయం సమయానికి అందకపోతే, ఆత్మహత్యతప్ప గత్యంతరంలేదని ఏనాడో నిర్ణయించేసికొన్నాను.

చేసేదేమీలేక, ఆ రోజు సాయంకాలం నా సోదరుడికిమాత్రం వ్రాశాను. ఏం వ్రాశానో సరిగా గుర్తులేదు. కాని ఒక్కటి మాత్రం గుర్తున్నది. సహాయం దొరక్కపోతే చనిపోతానని వ్రాశాను ఆ ఉత్తరం ఆలం చేతిలో పడకుండా, హమీద్ అడవిలో 10 మైళ్ళ దూరం పరుగెత్తి, పోస్టాఫీసుకు వెళ్ళాడు. అదే నా చివరి ఆశ.

తెలియదు.

ఒకనాడు, చంద్రుడు ప్రకాశిస్తున్న వెలుగులో ఎవరో అక్కడికివచ్చారు. ఆ సమయంలో నేను లోపల వంటచేస్తున్నాను. పిల్లలు— "అమ్మా ఎవరో ఇంగ్లీషువాడు వచ్చాడే! తెల్లవాడు వచ్చాడే" అంటూ అరిచారు.

"ఆయన ఎవరోకాదు, మీరే ఈవ్" అన్నది శ్రీమతి ఆలం, నాతో.

తరువాత కథంతా మీకు తెలిసిందే. శ్రీమతి ఆలం ఇన్ని సంవత్సరాలు చూపిన ధైర్యసాహసాలను చాలా కొద్దిమంది స్త్రీలుమాత్రం చూపగలరు.

మానవుని బాధల్లోని అద్యంతాలను ఆమె అనుభవించింది. ఆ జ్యోతిని సజీవంగా వుంచుకొన గలిగింది— ముమ్ముందు తన బిడ్డలను రక్షించుకొనేందుకు.

"ఆ తల్లికి" మళ్ళా కొత్త జీవితం ప్రారంభమవుతుంది. శ్రీమతి ఆలం ముమ్ముందు అనుభవించే ఆనందమూ, సౌఖ్యాలూ ఇంతకాలం అనుభవించిన కష్టపరంపరయొక్క దుఃఖాన్ని మైమరపించేంతటివి మాత్రమేకాదు, అంతకన్నా, మిన్నగాకూడా వుంటాయని మనమంతా ఆశించాలి.

అయిపోయింది

సైకిల్ మీద 6000 మైళ్ళు అబల సాహసయాత్ర ! పైవారమే !!



ఫ్రాన్సు, ఇటలీ మున్నగు పదకొండు దేశాల మీదుగా ఢిల్లీకి ఒంటరిగా ఆమె చేసిన ప్రయాణ మార్గం పటంలో చూడండి ! తర్వాత కథ చదవండి !

## వంటలు

### పెసరపప్పుతో హల్వా

కావలసిన వస్తువులు :

3 పావుల పాలు, ఒక పావు పెసర పప్పు, ఒక పావు పంచదార, ఒక పావు నెయ్యి, కొంచెము బాదంపప్పు కూడా వేస్తే బాగుంటుంది.

చేయు విధము:— పావు పెసర పప్పు రాళ్ళు లేకుండా వేడి నీళ్లలో నానపెట్టి, ఒకగంట నానిన తరువాత శుభ్రముగా కడిగి మరొక మారు గాలించుకుంటే క్రిందనవున్న ఇసుక వచ్చేస్తుంది. పప్పు మెత్తగా రుబ్బుకొని ఒక గిన్నెలో నెయ్యి పోసి ఈ ముద్ద అందులో వేసి బాగా ఎఱ్ఱగా వేయించవలెను. అడుగంటకుండా గరిటతో లాగి గట్టిగా కలుపుతూ వుండవలెను. బాగా వేగిన తరువాత ముద్దలో మూడుపావుల పాలు పోసి మళ్లీ కలుపుతూ వుండవలెను. కొంచెము ముద్దకాగానే పంచదార వేసి మళ్లీ బాగా కలు

పుతూ వుండవలెను. బాగా ముద్ద అయిన తరువాత పిస్తా బాదం వేసి ఒక పళ్లెమునకు నెయ్యిపూసి ముక్కలు చేసుకోవచ్చును. ఇష్టమైనవారు అలా ముద్దనే చిన్న గిన్నెల్లో పెట్టుకొని తినవచ్చును.

### కారం అరటికాయ వడ

కావలసిన వస్తువులు:

అరటికాయలు నాలుగు, ఒక కొబ్బరికాయ, వేయించిన సెనగపప్పు, ఒక అర్ధపావు గసగసాలు, పావు వెల్లుల్లిపాయలు నాలుగు, చిన్న అల్లం ముక్క, దాల్చిన చెక్క, నాలుగు లవంగాలు, నాలుగు పచ్చిమిరపకాయలు, రెండు ఉల్లిపాయలు (నీరుఉల్లి).

చేయు విధము:—అరటికాయలు ఉడికించి తొక్కతీసి; మెత్తగా రుబ్బాలి. కొబ్బరికాయ కోరుకొని ఆ కోరులో గసగసాలువేసి ముద్ద గట్టిగా రుబ్బాలి. వేయించిన సెనగపప్పు, సోపు, వెల్లుల్లి, అల్లం ముక్క, చెక్క, లవంగాలు కలిపి మెత్తగా గట్టిగా ముద్ద రుబ్బాలి. పచ్చిమిరపకాయలు, ఉల్లిపాయలు చిన్నముక్కలుగా కోసి ఈ రెండు వేయించి వుంచుకోవాలి. ఆ అరటికాయముద్ద, కొబ్బరిముద్ద, వేయించిన సెనగపప్పు ముద్దలన్నీ కలిపి అందులో ఆ వేయించిన ఉల్లి చెక్క పచ్చిమిరప ముక్కలు అన్నీ కలిపి మూకుడులో నూనెగాని, డాల్డాగాని వేసి ఈ ముద్ద చిన్న చిన్న వడలు లాగా చేసి వేయించవలెను. సన్నటి సెగమీద వేయించుతే బాగుంటాయి. ఇవన్నీ కలిపిన ముద్దలో వాటికి సరిపడ్డ ఉప్పుకూడా మర్చిపోకండేం? ఇలాగ అరటిపువ్వుతో కూడా చేస్తారు. అవి చాలా బాగుంటాయి!

జి. కృష్ణవేణి.





*అలసట పోయి*
*హుషారు కలగాలంటే...*

*మీరూ అంగీకరిస్తారు*

# టాటా-ఫిన్లే

# టీ

*సాటిలేని టీ!*



టాటా-ఫిన్లే టీ కంటె తృప్తికరమైనదేముంది! ఇందుకు కారణాలు:—

## తాజా టీ

తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

## పరిమళమైన టీ

అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

## ఉత్తమ టీ

టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

**టాటా-ఫిన్లే** *టీ త్రాగండి; ఆనందము అందుకోండి!*

ఈ క్రింది రకాలలోను, ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే టీ దొరుకుతుంది:-

ప్రెస్టిజ్ డార్జిలింగ్—సుందరమైన టిన్
లలిత్—బంగారు రంగు ప్యాకెట్
మిలాప్—వెండి రంగు ప్యాకెట్
బహదూర్-నారింజ రంగు ప్యాకెట్
షాన్—నీలి రంగు ప్యాకెట్



# హృదయ కుసుమాలు

14 వ పేజీ తరువాయి

వచ్చు. ఆవిడకు లౌక్యం అసలు తెలీనే తెలీదు. నా కూతుర్ని ఇంత కష్టపెడుతున్నారా, అంటూ నావురు మంటుంది. ఇంక నీ కష్టసుఖాలు నాక్కాక ఎవరికి చెపుతావు. నాకు నువ్వు, నీకు నేనూ ధైర్యం చెప్పుకోవాలి. సిగ్గు పడక అన్ని విషయాలూ చెప్పు. నా జీవితం ఎట్లా గడుస్తుందో నాకు తెలీదుకదా? నీ జీవితం ఇట్లా మారిపోతుందనీ, నువ్విట్లా అవుతావని, ఇలాంటి మానసిక వ్యధలకు గురవుతా వనీ నేను కల్లోనయినా అనుకోలేదు. మనస్సులో ఉన్న విషయాలూ, అనుభవించిన కష్టాలూ నాకు చెప్పు. నేనేమీ అనుకోను. నీ కష్టాలకు నేను ఏ విధంగానూ ఆదుకోలేక పోవచ్చు. కాని నీని సానుభూతి కనబర్చ గలను. అంతకన్న ఈ చెల్లెలు సీత నీ కాపురం ఎట్లా తీర్చిదిద్దుతుంది? నేలంలో నీ జీవితం అమ్ముడు పోయింది. నా జీవితం ఇంకా పాటకు రాలేదు. నిన్ను చూస్తుంటే నా కడుపు తరుక్కుపోతున్నది. కాపరానికి వెళ్ళాక ఎంత కులాసాగా, చలాకీగా ఉంటావో అనుకున్నాను. అందుకు అంతా వ్యతిరేకంగానే ఉన్నది. ఈ రాత్రి ఎంత పొద్దు పోయినా నువ్వు పూర్తిగా అన్ని విషయాలూ చెప్పంది నేను నిద్రపోను, నిన్ను నిద్ర పోనీయను.'' అన్నాను.

నా పట్టుదలకు అక్కయ్య పేలవంగా నవ్వింది. ''సీతా, నేను ఇంటరు పరీక్ష ఫస్టుక్లాసులో పాసయి నప్పుడు ఎంత సంతోషంతో పొంగిపోయానో నీకు గుర్తుందికదూ, నా వివాహానికి ముహూర్తాలు పెట్టుకున్నపుడు అంతకు పదిరెట్లు పొంగి పోయాను. వారు నా మెళ్ళో ఈ మంగళసూత్రం కడుతుంటే నా మనస్సు పులకరించి హృదయం ఎంతో ఆనందంతో, సంతోషంతో నిండి పోయింది. నా కళ్ళల్లో వెయ్యి విద్యుద్దీప కాంతులు మెరిసిన సంగతి నీకూ తెల్సు. మర్నాడు మా దంపతుల్ని ఒకటి చేశారు.'' అన్నది అక్కయ్య.

''అవును'' అన్నాను నవ్వుతూ. ఇంకేం మాట్లాడాలో అంతకు మినహా నాకేమీ తోచలేదు.

''ఆ రోజు ముహూర్తమయింది. అంతటితో నా జీవితంలో దుర్ముహూర్తం ఎదురైంది.'' అని బరువుగా నిట్టూర్చింది అక్కయ్య.

''తరువాత'' అన్నాను.

అక్కయ్య నా వైపు నిరాశగా చూసింది.

''నీ వయస్సు ఇరవై రెండుకదూ'' అన్నారు మా బావ. ఎందు కడుగుతున్నారో నాకు తెలీలేదు. నవ్వుతూనే ''అవునండీ నా వయస్సు ఇరవై రెండేళ్ళు. సరేకాని ఇప్పుడు వయస్సుతో పనే మొచ్చింది'' అన్నాను.

అంతలోనే వారి ముఖంలో చీకట్లు కమ్మి నయ్యి. ఆ కళ్ళల్లో క్రోధం కొట్టొచ్చినట్లు కనబడింది. ''అనుమానస్త పడుతున్నానని నీ మనస్సులో బాధ పడకు, వయస్సు అటువంటిది.'' అంటూ నా వైపు ముభావకంగా చూశారు.

వారన్నది నాకు అర్థం కాలేదు. వారట్లా నావైపు చూస్తుంటే ఖిన్నురాలి నయాను. వారి ముఖంలోకి చూడలేక కళ్ళు మూసుకున్నాను. ఆ అనుమాన మేమిటో నాకు తెలియలేదు.

''అవునా జానకీ'' అన్నారు కోపంగా నా భుజాలు పట్టుకుని వూపుతూ. విభ్రాంతితో వారి కళ్ళల్లోకి చూశాను. వారి ముఖం కోపంతో ఎర్రబడింది. నేను వణికి పోయాను. ఏం మాట్లాట్టానికీ నాకు తోచలేదు. కళ్ళంట నీరు తిరిగింది. అవమానంతో శరీరం వణికి పోయింది. మెల్లిగా తేరుకుని ''అంటే మీ ఉద్దేశ్యం'' అన్నాను.

వారు నా వైపు సూటిగా చూస్తూ:

''జానకీ మా డాక్టరు మావయ్యంటే నీకు చాలా ఇష్టంకదూ'' అన్నారు కోపంతో నా వైపు చూస్తూ.

నాలో క్రోధం, అవమానం, దుఃఖం, ఆవేశం రెచ్చిపోయినయ్యి. నాకు అయోమయమై పోయింది. ''నా మీద అంత అనుమానం ఎందుక్కలిగిందండీ నా వల్ల తప్పేమిటి'' అన్నాను. అంతే నా చెంపలు వాచినయ్యి అట్లాగే పడిపోయాను. ఒక్కసారిగా ఇంత జరిగేసరికి నాకేం చెప్పాలో తోచలేదు. కొంతసేపటికి కళ్ళు తెరిచాను.

''నీకూ నీ చిన్న మావయ్యకూ సంబంధం లేదంటావా. పెళ్ళయ్యాక ఇక్కడ మా ఇంట్లో ఉన్న మూడు రోజుల్లోనూ అతని ప్రవర్తన నేనూ కనిపెట్టే ఉన్నాను. అనుభవం లేంది అంత చనువుగా అతను నీతో ఎందుకు మాట్లాడుతాడు. అంతగా పరిచయం లేందే అట్లా పరిహాసంగా మాట్లాడుతాడా. ఇదంతా నాకు తెలీదనుకున్నావా'' అన్నారు. వారి నోటితో ఈ మాటలు వినంగానే నాకు మతి పోయింది. ఏం మాట్లాడాలో ఏం చెప్పాలో నాకు అర్థం కాలేదు. చిన్న మావయ్యకూ నాకూ సంబంధం ఉన్నదా ? చచ్చిన చినమావయ్య ఆ శుభ సమయంలో ఆ రీతిగా వారికి గుర్తొచ్చారన్న మాట. నా మనస్సులో చీకట్లు కమ్ముకున్నయ్యి.

''నాలో పరాభవం రెచ్చిపోయింది. జీవితం మీద విరక్తి కలిగింది. ఆడబ్రతుకంటే ఇన్ని అవమానాల పాలుగావాలా అనిపించింది. వారు నాతో మరి మాట్లాడలేదు. నా నిర్దోషిత్వం ఋజువు చేసుకోవాలి. ఏం సమాధానం చెపుదామనుకున్నా ఆ సమయంలో వారు వినిపించుకునేటట్లు లేరు.

కొంత సేపయాక నాకు నేనే సమాధానం చెప్పుకుని తెప్పరిల్లుకుని ''నా మీద మీకింత అనుమానం ఎందుకు కలిగిందో నా కర్థం కావటం లేదు. చిన్న మావయ్యతో చనువుగా మాట్లాట్టం నుంచి మీరు ఇంత అపోహ పడ్డారన్న మాట. దేవుడు లాంటి చిన్న మావయ్య మీదనా మీ అనుమానం. చచ్చిన చినమావయ్య మీద ఈ అభాండాలు! ఆలోచించండి. చాలా తొందర పడ్డారు. దైవ సాక్షిగా నేనే పాపం ఎరుగను. నా జీవితంలో తుచ్ఛమైన ఆలోచనలు ఎప్పుడూ కలగలేదు. ఇంక ముందు కలుగవు. ఇంతకన్న ఏం చెప్పాలో నాకు తెలీటం లేదు. అనుమానం అనర్థాలకు హేతువే. నా జీవితంలో ఇటు వంటి అభాండాలు కూడా నెత్తినా వేసుకోవాల్సొసు ందని నేను కల్లోనయినా అనుకోలేదు.'' అని ప్రాధేయపూర్వకంగా నా నిర్దోషిత్వాన్ని చెప్పుకున్నాను. నన్ను మంచం మీది నుంచి క్రిందికి నెట్టేసేశారు. ఆ రాత్రి తెల్లవార్లూ నాకా కటిక నేల ఆశ్రయమైంది. నా కన్నీరంతా

భూదేవి పీల్చివేసింది. కళ్ళు వాచినెయ్యి. ముఖ మంతా ఎఱ్ఱబడ్డది. నా బుగ్గలు దెబ్బలకు కంది వయ్యి.

"తెల్లవారింది. అంతా నన్ను చూసి నవ్వుకున్నారు. ఎవరి ఆలోచనలు వాళ్ళవి. ఎవరి అనుభవాలు వాళ్ళవి. ఎవరి వూహాలు వాళ్ళవి. ఆ రోజు అటువంటిది. ఆ ముహూర్తం అటువంటిది. ఆ సమయంలో ఆడవాళ్ళ ఆలోచనలు అట్లా ఉండటంలో తప్పేమీ లేదు. అందుకు నేను బాధ పడలేదు." అన్నది అక్కయ్య.

ఈ మాటలు అక్కయ్య చెపుతుంటే బావ మనస్తత్వం ఇటువంటిదా అని ఆశ్చర్య పోయాను. చిన్న మావయ్య మీద అనుమానమా ! ఛీ మృత్యుదేవత ఈ రాబోయే పరిణామాలను వూహించే చిన్న మావయ్యను ఆ రీతిగా తీసుకు పోయింది. చిన్నమావయ్య గనక బ్రతికేఉంటే ఈ అభాండాలు విని కుమిలిపోయి బావకు ఎట్లా నచ్చ చెప్పాలో తెలీని, మనోవ్యధతో మంచమెక్కి ఆ రీతిగానైనా ప్రాణాలు పోగొట్టుకునే వాడే. బాంధవ్యాల్లో అతి మంచిగా ఉన్న, చనువుగా ఉన్నా, కలుపుగోలుతనంగా ఉన్నా, అనర్థాలకు దారి తీస్తుందేమో !

"అక్కయ్యా ! బావ ఇంత సంకుచిత హృదయుడని అనుకోలేదే. నీ నెత్తిన ఇటువంటి అభాండాల కొరివిని ఉంచుతారనుకోలేదు. కాలేజీలో లెక్చరరు. జ్ఞానహీనులూ, సహృదయులను అర్థం చేసుకోలేని వారూ డిగ్రీలు తెచ్చుకున్నా మూర్ఖులతో సమానమే." అన్నాను.

"మరేమనుకున్నావే సీతా, మా అత్తగారు నన్ను కాల్చుకుతింటున్న దనుకున్నావా, దీనికి తోడు అది కూడా ఉంటే ఇంక నా జన్మ తరించినట్లే. మీ అందరి దయవల్ల ఆ గొడవలు లేవు." అన్నది.

ఈ మాటకి కొంచం సంతోషించాను.

"తరువాత"

"మర్నాడు కూడా వారు నాతో మాట్లాడలేదు. దాదాపు గంటసేపు అట్లాగే నిల్చున్నాను. "అట్లా నిల్చున్నావేం. ఇట్లారా" అన్నారు. వచ్చి మంచం మీద కూర్చున్నాను. నా దుఃఖం కట్టలు




# హృదయ కుసుమాలు

తెంచుకుని ప్రవహించింది. "ఎందుకండీ. నాకీ అపనింద. నా వల్ల తప్పుంటే మీరన్న మాటలకు ఈ రాత్రి మళ్ళా మీ వద్దకు వచ్చేదాన్నే కాదు. అందరితో బాటుగా మీరూ నా శవాన్నే చూసే వారు. కాని నేను చావదల్చుకోలేదు. ప్రాణాలు తీసుకుంటే అపవాదు యదార్థమే అవుతుంది. మీ మనస్సులో ఈ విషబీజం ఎట్లా మొలకెత్తిందో నాకు తెలీటం లేదు." అన్నాను.

" జానకీ " గద్దిస్తూ నా వైపు చూశారు. వణికి పోయాను.

" కల్లిబొల్లి ఏడుపులు కట్టిపెట్టు. రంకు నేర్చినమ్మ బొంకు నేర్వకపోదు. ఎన్ని చెప్పినా నా అనుమానానికి కావాల్సినన్ని ఆధారాలున్నాయ్యి." అన్నారు.

" మీరు చూసిన ఆధారా లేమిటో చెప్పండి. వింటాను. నా నిర్దోషిత్వాన్ని ఋజువు పర్చుకుంటాను. దైవ సాక్షిగా మీమీద ప్రమాణం చేసి చెబుతున్నాను. మీరు అనవసరంగా నామీద నింద మోపు తున్నారు." అన్నాను.

" నా ప్రశ్నలకు సరిగ్గా సమాధానం చెబుతావా"

" అడగండి "

" మూణ్ణిద్రలకు మా ఇంటికి వచ్చినప్పుడు మొదటి రోజున ఏమన్నాడో మీ చిన్న మామయ్య తెలుసా. ఆ మాటలు నాకింకా చెవుల్లో ప్రతి ధ్వనిస్తునే ఉన్నాయ్."

" ఏమన్నాడు చిన్న మామయ్య.?"

" జానకీ, పెళ్ళయాక ఎంతో మారిపోయినట్లున్నావ్. చాలా సంతోషం. మీ లెక్చరరుగార్ని చూస్తూ మా అందర్నీ మర్చిపోయేవ్ సుమా" అన్నాడు. ఆ మాటలోనే తేలింది మీ ఇద్దరి లోగుట్టూ. దీనికి నీ సమాధానం " అన్నారు.

" సాధారణంగా పెళ్ళయి కాపురానికి వెళ్లిన వాళ్లను బంధువులంతా ఎగతాళిగా అట్లా అంటారు. ఆ మాటల్లో విపరీతార్థం తీయవలసినంత విషయ మేమీలేదు. మా కుటుంబమంటే చిన్న మామయ్యకున్న అభిమానం కొద్దీ అట్లా ఎగతాళిగా అడిగాడు. ఆ మాటల్ని మీరీ విధంగా అర్థం చేసుకున్నారన్నమాట." అన్నాను.

" అంతేకాదు. అనేక సందర్భాల్లో కూడా నీతో మీ చిన్న మామయ్య ఛలోక్తిగా, చనువుగా మాట్లాడాడు. ఎంత చనువు, ఇష్టతా, ప్రేమ లేంది వయసొచ్చిన వాళ్లతో పెళ్లయాక కూడా మేనమామ అంత నిబ్బరంగా పరాచికాలాడుతూ మాట్లాడుతాడు. ఏమీ లేకపోతే అట్లా ఎవ్వరూ, ఎప్పుడూ మాట్లాడరు. పెళ్లి కానప్పుడు చనువుగా మాట్లాడినా పెళ్లయ్యాకనైనా గౌరవంగా మాట్లాడుతారు. పెళ్లయ్యాక మీ సరదాలు ఇంకా ఎక్కువయినయ్యి " అన్నారు.

" మానవ మనస్తత్వాలు మీరా విధంగా అర్థం చేసుకుంటారన్నమాట. పెళ్లయ్యాక ఆ మరుక్షణమే ఆ పిల్ల భర్తకు అంకితమై పోతుంది. ఆ భర్తకు భార్య మీద సర్వ అధికారాలూ ఏర్పడుతయ్యి. ఇంక తన భార్యతో ఎవ్వరూ మాట్లాడ కూడదనీ, ఆమెవైపు ఎవ్వరూ తలెత్తి చూడకూడదనీ అనుకోవటం సహజమే. కాని ఆప్తులయిన వారూ, మన మంచి చెడ్డలు బాగోగులు ఆలోచించే వారు సైతం ఆ పెళ్లయిన పిల్లతో ఇంక ఏ విధంగానూ మాట్లాడకూడదనటంలో అంత అర్థం లేదేమో. నిన్న మొన్నటి వరకూ తమ బంధుకోటిలో ఉన్న వ్యక్తి ఈ రోజున పరాయి ఇంటి కోడలయిందనగానే అంతవరకూ ఉన్న బంధుత్వాన్నీ సహృదయంతో చూపే ఆదరాభిమానాలనూ ఒక్కసారిగా తెగతెంపులు చేసుకోవటం కష్టసాధ్యం. అనుమానం పెనుభూతం లాంటిది. చిన్న మామయ్య మీద మీకటువంటి అనుమానం కలిగిందంటే అది కేవలం నా ఖర్మను కోవటం తప్ప వేరే ఏమీ చెప్పలేను. మంచి వాళ్లను భగవంతుడు కూడా బ్రతక నివ్వడు. అందుకనే మామయ్య ఈ లోకాన్ని శాశ్వతంగా విడిచిపెట్టి పోయాడు." అన్నాను.

" బాగానే సమాధానం చెప్పావే జానకీ. అందుకు ఏమన్నారు బావ." అన్నాను.

" నిజమే. నా కళ్ల ఎదుట లేకుండా భగవంతుడే నాకూ సాయం చేశాడనుకున్నాను. లేకపోతే నా చేతుల్లో ......." అంటూ పళ్లు కొరికారు.

" ఆ రాత్రి మరి నాతో మాట్లాడలేదు.

ఆరాత్రి కూడా నాకా కటిక నేల శరణ్యమైంది. చేతుల్లో తలదాచుకుని కుమిలి పోయాను. నేను జానకీ దేవిని కాదు అగ్ని ప్రవేశం చెయ్యటానికి.

అశరీర వాణి నాకన్యాయాన్ని గురించి పైనుంచి పలికేందుకు మనమేం పురాణకాలపు పుణ్య స్త్రీలం కాము. అనుమానం కలగటానికి ఏ ఆస్కారమూ అక్కరలేదు. అది తొలగాలంటే కొన్ని సంవత్సరాలు పడుతుంది. వారికి నచ్చ చెప్పటానికీ మామీద వారికి గల అనుమానాన్ని తీర్చటానికీ చిన్న మామయ్య బ్రతికి ఉండలేదు. ఇంక వారికి ఎవరు చెబుతారు. వారి మనసులో పాతుకు పోయిన శంకను ఎవరు తీరుస్తారు. ఎన్ని చెప్పినా వారు నామాటలు వినలేదు. నా మాటలు నమ్మలేదు. మధురాతి మధురంగా గడపాల్సిన ఆ రెండు రోజులూ దిగులుగా విచారంతోనే గడిచి పోయినయ్యి." అన్నది అక్కయ్య —

ఇంత వరకు సీత చెప్పిన విషయాలన్నీ విని రాధ చాలా విచార పడ్డది.

" మీ బావకు చదువున్నదిగాని సంస్కారం లేదు. ఆలోచనలు ఉన్నవి గాని అవి అర్థరహితమైనవి. హృదయ మున్నది గాని అది అనుమానాల పుట్ట" అన్నది రాధ.

మళ్లీ సీత చెప్పబోతూ వుండగా ఏదో ఒక కాన్పు కేసు ప్రమాదంగా ఉందని నర్సు వచ్చి చెప్పటంతో సీత నర్సింగ్ హోమ్‌కి వెళ్లింది. అప్పటికి రాత్రి తొమ్మిది గంటలయింది. (ఇంకావుంది)

"వాళ్లు ఇంగ్లీషు సినిమా కెళ్లారు. నాకా సినిమాలు నచ్చవనేమాట నిజమే ననుకోండి. కంపెనీగా వెళ్లేందుకు గూడా పనికిరానా ? నేను రానక్కర్లేదని సావిత్రి అన్నది. ఏదైనా తెలుగు సినిమా కెళ్లమని గౌరీపతిగారు నాకు సలహా యిచ్చేరు" అన్నాడు దిగులుగా.

"మీరేం బాధపడక్కర్లేదు. అకాడికి వాళ్లిద్దరికీ ఇంగ్లీషు సినిమాలు అర్థమౌతాయనుకుంటున్నారా ? అదోరకమైన మోజంతే. పోనీండి, మనిద్దరం హాయిగా మల్లీశ్వరికే వెడదాం. సరేనా?" అన్నాను.

అతను తలూపాడు. ఇద్దరం మల్లీశ్వరికే వెళ్లేము. ఒక మనిషిని ఎద్దేవా చేయడం సులువైనపనే గావచ్చు. మనిషికున్న విలువల జోలికి పోయి ధర కట్టడం అన్యాయం. ఎంత మంచి మనిషికైనా సహన మనేది పరిమితిలో ఉంటుంది. ఆ మంచితనంమీద ఎదటివాడు విరుచుకుపడి అవహాస్యం చేస్తే—ఏమో చెప్పలేను—పగపట్టిన మనిషి ఎన్ని దారుణాలైనా చేయగలడని చరిత్ర చెబుతూనే ఉంది.

ఇంత మాత్రంచేత సావిత్రినీ, గౌరీపతినీ నిందించడంగానీ, నా విశాల హృదయాన్ని చాటి చెప్పాలనే తాపత్రయంగానీ, విశ్వనాథాన్ని హీరో చేయాలనే తపనగానీ, పై అభిప్రాయం తెలిజేయదు.

ఆ రోజు అలా గడిచింది.

మరో చిత్రాతి చిత్రమైన సన్నివేశంలో గౌరీపతి ఇరుక్కున్నాడు. మా ఆఫీసుకోనాడు రెండు జడల సావిత్రి ఒచ్చినట్టే ఆనాడూ మరో యువతి గౌరీపతికోసం వచ్చింది. ఆఫీసులో కడుపుమండిన ఆసామి కాస్త బిగ్గరగానే అనేశాడు—

"అయినా ఇంత పిచ్చి పనికిరాదు సుమాండి."

ఆ ఆసామి మాటవిని నేనే నొచ్చుకున్నాను. గౌరీపతి వినివుంటే అతనికోపం తారస్థాయినందుకోవాలి. కానీ అలా జరగలేదు. ఆ అమ్మాయితో మాట్లాడివచ్చిన తర్వాత సీట్లో కూర్చుంటూ అన్నాడు.

"రాజ్యలక్ష్మి అని మా పిన్ని కూతురు. వాళ్ల ఫ్రెండు పెళ్లికీ వూరొచ్చిందట, వెంట మరో యిద్దరు చెలికత్తెలతో సహా. ఈ రాత్రి పదిన్నరకి కారుమీద తిరుగు ప్రయాణంట. ఫస్టుషో సినిమాకి రమ్మంది. దాంతో సినిమా చూడటం నా కిష్టంలేదు. నేను రానని చెప్పేను. ఇదీ జరిగిన కథ. కానీ మనఫూల్స్‌కి మాత్రం బుద్ధుల్లేవు."

అదే సాయంత్రం విశ్వనాథం మా రూమ్ కొచ్చేడు. వచ్చీ రావడంతోనే వాచీ చూసుకుని వెలుగుతూన్న సిగరెట్టు పారేసి అన్నాడు—

"ఏమైనా సరే! మనం ఈ వేళ ఇంగ్లీషు సినిమాకే వెడదాం. వాళ్లిద్దరూ వెళ్లారు."

"గౌరీపతి గూడానా?"

"వాళ్లిద్దరంటే సావిత్రి, అతనే గదండీ!" అన్నాడు మరో సిగరెట్టు ముట్టిస్తో.

ఇంతకుముందే రాజ్యలక్ష్మి వాళ్లన్నయ్య గౌరీపతిని సినిమాకి వెడదామని అడిగింది. అతనికి ఆ అమ్మాయిలో సినిమా చూడటం ఇష్టంలేదని చెప్పేడు. ఇప్పుడు అతని చెల్లి సావిత్రితోపాటు

23 వ పేజీ తరువాయి

ఇంగ్లీషు సినిమాకెడుతున్నాడు.

రాజ్యలక్ష్మి పిన్నికూతురు— అనగా — చెల్లి సావిత్రి స్నేహితురాలు, వామాంతరం— సోదరి. అతని అభిప్రాయాలు ప్రకారం అతనికి ఈ ఇద్దరూ చెల్లాయిలే! అంతవరకూ బాగానే ఉంది. రాజ్యలక్ష్మితో సినిమాకెళ్లడం ఇష్టంలేదుగానీ సావిత్రితో వెళ్లడానికిష్టపడ్డాడు. నిజమే— నా మట్టుకు నాకు చెల్లాయితో బజారుకెళ్లడంగానీ, సినిమా చూడటంగానీ ఇష్టంలేదు. కారణాలు అనేకం. ఆ విధంగా గౌరీపతి రాజ్యలక్ష్మితో సినిమాకెళ్ల లేదంటే ఒప్పుకుంటాను. కానీ, ఈ చెల్లి సావిత్రితో సినిమా చూడటంలో అతనికి ఇబ్బందులేమీ ఉండవా ? ఉన్నా అవి నిజమైన ఇబ్బందులు కావా? ఇదీ నా ప్రశ్న.

ఓ పక్క— విశ్వనాథం సినిమాకి వెళ్లే తొందరలో నన్ను తొందరచేశాడు. గబగబా బట్టలు మార్చుకుని బైటపడ్డాను. ఇద్దరమూ థియేటరు దగ్గర రిక్షా దిగాం. అప్పుడే సావిత్రీ, గౌరీపతీ థియేటర్లోకి వెడుతున్నారు.

ఒకడు : మీా రెక్కడుంటున్నారండీ !

రెండవవాడు : ఇరవయ్యో శతాబ్దంలోనండీ !

ఎం. రాంమోహన్ (తెనాలి)

విశ్వనాథం పళ్లు నూరాడు. అతని కళ్లలో కోపం ప్రస్ఫుటంగా కనిపించింది. సినిమా మానేద్దామనుకున్నాను. కానీ ఆసరికే విశ్వనాథం టిక్కెట్టు తీసేసుకున్నాడు.

లోపలికి వెళ్లాం. సీట్లో కూర్చోబోతూ నా ముందు సీట్లో ఉన్న అమ్మాయిని చూచి ఉలిక్కిపడ్డాను. ఆమె రాజ్యలక్ష్మి! ఆమెకిరువైపులా గౌరీపతి చెప్పిన చెలికత్తెలూను.

లైట్లు ఆర్పి న్యూస్‌రీలు ప్రారంభించారు. నా పక్కన కూర్చున్న విశ్వనాథం సినిమా చూడటం మాని వెనగ్గా కూర్చున్న సావిత్రీ, గౌరీపతుల వైపు చూస్తున్నాడు. రాజ్యలక్ష్మి కేరింతలు కొడుతూనే ఉంది.

ఇంటర్వెల్లో అనుకున్నంతా అయ్యింది. గౌరీపతినీ సావిత్రినీ రాజ్యలక్ష్మి చూచింది. చూచిన వెంటనే లేచి అటువైపు నడిచింది. విశ్వనాథంతోపాటు బైటకొచ్చేశాను. సిగరెట్లు కాల్చుకుంటూండగా రాజ్యలక్ష్మి గౌరీపతులు బైటకొచ్చేరు. మాక్కాస్త దూరంగా నించున్నారు.

"ఎవర్రా ఆ పిల్ల ?"

"నా స్నేహితురాలు"

"నాతో సినిమాకి రాననిచెప్పి ఇప్పుడెందుకొచ్చావ్?"

విషయం తెలుస్తే..........."

"అబ్బ. ఆట్టే మాటాడకు నీ పుణ్యముంటుంది. ముందు లోపలికి పద."

విశ్వనాథం చేయి పుచ్చుకుని గేటు దాటేను. రిక్షా ఎక్కి మా రూము కొచ్చేశాము. గౌరీపతి ఎలాంటి ఇరకాటంలో నలిగిపోయి ఉంటాడో వూహించడానికే భయంగా వుంది. దానికి తగ్గట్టుగా విశ్వనాథం గౌరీపతిమీద విరుచుకుపడ్డాడు. చివరికి కొన మెరుపన్నట్టు—

"నేను అతని డైరీ సంపాయించాను మాస్టారూ చూడండి. దీన్లో మా సావిత్రి గురించి అతనెంత దారుణంగా వ్రాసుకున్నారో మీరే చదవండి." అతని జేబులోంచి డైరీ తీశాడు.

అదిరిపడ్డాను.

"మీాకెలా దొరికిందీ డైరీ!"

నవ్వడం మాత్రం అమాయికంగా నవ్వేడు.

"నన్నందరూ ఫూల్ నన్నారు. కానీ ప్రేగులు లెక్కపెట్టగలను. మీా గౌరీపతి గురించి వూహించలేనంత చవటనుగాను. అవుతే గట్టిగా వాగుతే కలిగే నష్టం మాకే గనుక మౌనం వహించేను. మావయ్య సావిత్రిని నెత్తికెక్కించుకున్నాడు. ఆడపిల్లకి అతిగారాం నేర్పాడు.........."

ఇంకేదో అనబోయాడు. అతని ఆవేశం చూచిన తర్వాత నాకే భయం కలిగింది. అంచేత అతని మాటకి అడ్డుపడి అన్నాను.

"జరిగిందేదో జరిగిపోయింది. పరాయివాళ్ల డైరీని చదవడం తప్పు. దయచేసి మీారా డైరీని అతనికిచ్చేయండి. అది మర్యాద."

"ఎవరికివ్వాలో నాకూ తెలుసు మాస్టారూ!" అన్నాడు, సిగరెట్టు ముట్టిస్తూ. ఆ తర్వాత అతను లేచి నిలబడి 'గుడ్‌నైట్' చెప్పి, డైరీ తీసుకుని వేగంగా వెళ్లిపోయాడు.

అవమానాన్ని మనిషి సహించలేడు. అందులో సాక్షాత్తు ఒక ఆడపిల్లా, ఒక కుర్రాడు కలిపి మరో కుర్రాడిని ఎద్దేవాచేయడం!?

విశ్వనాథం రుద్రు డయ్యాడు. ఇదిమాత్రం నిజం.

* * *

ఈ కథకి ముగింపు అతి భయంకరముగా వ్రాయాలని మొదట్నుంచీ అనిపించలేదు. దీన్లో ప్రత్యేకంగా నేనెవర్నీ దూషించనూ లేదు. గౌరీపతి అనే వ్యక్తి— కాలం కలిసి రాకపోతే— నేనే కావచ్చు. కథలు వ్రాసేవాళ్లలోనే గౌరీపతి ఉంటాడనీ నా అభిప్రాయంకాదు. ఆ మాటకొస్తే స్వజాతిమీద వల్లమాలిన పక్షపాత బుద్ధి నాకు.

ఇప్పటికీ విశ్వనాథం గౌరీపతి గురించి అంటాడు.

"అతను రెండు రకాల మనిషి. 'సోదరి' అని అతని పరిచయాన్ని ప్రారంభించకపోతే— ఏమో సావిత్రి నాకు దక్కేది కాదేమో. కానీ అంత ధైర్యం అతనికెక్కడేడ్చింది మాస్టారూ! వీళ్లంతా ముసుగులో దాక్కున్న దొంగలు."

గౌరీపతిలాటి మనిషిమీద జాలి ప్రదర్శించేది నేను ఒక్కణ్నేనేమో!



# రాగోదయం

యం.వి. నారాయణాచార్య

అప్పుడే 'రూం' లో అడుగు పెట్టిన శంకరం ఆశ్చర్యపోయాడు—రూమంతా దేదీప్యమానంగా వెలిగి పోతోంది. 'టేబిల్ లైట్' లో అమర్చిన నలభై కేండిల్ బల్బే నూరు కేండిల్ బల్బుని మించి వెలుగుతోంది. ఆ లైటు వెలుగులో భాస్కర్ మొహం కూడా ఓ వెలుగు వెలిగేస్తోంది.

''అమ్మ బాబోయ్!! భాస్కర్ భగవద్గీత లాటి దేదో నమిలేస్తున్నాడు!'' గుండెలు గబగబలాడాయి శంకరానికి.

''హాయనా! బావీ!! నీకీవేళ ఏమైందిరా? హాయిగా మస్తుగా తిని నవ్వుతూ—పేలుతూ తిరుగుతూ ఎప్పుడేనా సరదాగా కాలేజీక్లాసులు 'విజిట్' చేసే కళాశాల విద్యార్థి! —ఇలాగై పోయావేమిట్రోయ్! దేవుడోయ్! '' అన్నాడు శోకాలు వినవొగా.

భాస్కర్ ఉ (ప)లకలేదు. వెనకాలే వెళ్ళి రెండు భుజాలూ పట్టుకు ఊపేడు శంకరం.

''ఒరేయ్! ఒరేయ్!!'' అని గావు కేక పెట్టాడు. భాస్కరం తాపీగా పుస్తకంలో ఖుర్రని ఒకసారి శంకరం ముఖంవేపు తిప్పి— నిరాశా, నిస్పృహా సర్వజ్ఞతా—సన్న్యాసి భావం—ఇత్యాదులేవో మిళితం చేసిన బాపతు ఒక 'దృక్కుని' వాడి మొహం మీదికి విసిరేసి ముదిరి పోయిన వేదాంతి 'పోజు'లో ఒక 'విషాదభరిత చిరునవ్వు' ను పారేశాడు. 'హాం' అని కూడా మూలిగాడు—దేవదాసులో హీరో నాగేశ్వర్రావులాగ.

శంకరాని కిప్పుడు నిజంగా గుండె దడ ప్రారంభ మయింది.

విసిరి పారెయ్యమన్నావా?" అని గట్టిగా అరిచేడు.

వాడు వినిపించుకో పోగా తనే గబగబ పది మెట్లు కిందకి దిగి ఉద్వేగాన్ని అణుచుకుని:

"అసలేం జరిగిందో చెప్పరా! నాయనా!" అన్నాడు లాలనగా చుబుకాన్ని స్పృశిస్తూ— ఈలోగా వాణ్ణి మరపించి వెనకనించి పుస్తకాన్ని లాగేశాడు.

భాస్కర్ జేబులో చెయ్యి పెట్టి సిగరెట్ కోసం వెతికాడు. సదరు సిగరెట్లు ఇదివరకే అగ్ని జ్వాలల్లో ఆహుతై శుష్కించి 'ఏష్' ట్రేలో ప్రమగ్నమై దన్న విషయాన్ని పసికట్టినవాడై ఏష్ ట్రేని బోర్లించి జీర్ణ వదనయ్యైన ఆ సిగరెట్‌నే వెలిగించి

"నేనిక సన్యాసుల్లో కలసి పోతారా శంకర్" అన్నాడు బాధగా.

"ఒరే వాన్నా! నేనింకా బ్రతికే ఉన్నానా ! అసలేం జరిగిందిరా?" అన్నాడు శంకర్— గుమ్మడి డైలాగునీ పోజునీ కూడా ఎరువు తెచ్చుకుంటూ.

"ఏం చెప్పమన్నావ్‌రా! మా మావయ్య..."

"తన కూతుర్నివ్వనని గాని అన్నాడా" అన్నాడు నీరుకారి పోతూ...

"కాదురా!ఇస్తానంటున్నాడ్రా"అన్నాడు భాస్కర్.

"నిక్షేపంలా చేసుకోరా! " ఎగిరి గంతేశాడు శంకర్.

"అది కాదురా......"

"అదీ కాదు— ఏదీ కాదు 'యస్' అని రాసి పారెయ్!" అన్నాడు రెట్టించిన ఉత్సాహంతో.

"ఒరేయ్ నాయనా!... మా మావయ్య కూతురు బొత్తిగా ఏనుగుగున్నలాగుంటుందిరా" బిక్క మొహం వేసుకుని చెప్పలేక చెప్పలేక చెప్పాడు భాస్కర్.

ఈ దెబ్బతో శంకరం నీరు కారిపోయాడు.

అవును!——— చూస్తూ చూస్తూ—అలాటి పిల్లని చేసుకోమని తను మాత్రం ఎలా సలహా ఇవ్వ గలడు?

"ఫలానా కారణంగా నా కిష్టం లేదని రాసి పారెయ్" అన్నాడు ఫైనల్‌గా.

"అబ్బే అదేం లాభం లేదురా! మావయ్య వూరుకున్నా.... మా నాన్న .." నాన్న రూపం మెదిలే సరికి శరీరం వణకడం ప్రారంభించింది భాస్కరానికి.

శంకరం బుర్ర మొద్దెక్కి పోయింది. జేబులు తడివి సిగరెట్ పాకెట్ పైకి తీశాడు. తనోటి వెలిగించి భాస్కర్ నోట్లో ఒకటి ఉంచాడు. మూడు వ్వర సిగరెట్లు తగలేశాక ఓ ఐడియా లీలగా స్ఫురించింది శంకరానికి. మరో రెండు తగలెయ్యగా దానికి ముక్కూ మొహం రూపం ఏర్పడింది. దాన్ని భాస్కరానికి వివరించాడు. భాస్కరానికి కూడా నచ్చినట్టే ఉంది. కాని—మామయ్య—నాన్న గుర్తుకొచ్చినప్పుడల్లా గుండెలు దడదడలాడుతున్నట్టే అనిపిస్తోంది.

శంకరం సలహా ప్రకారం భాస్కర్ తన ఊహా సుందరి పేర ఘాటైన ప్రేమ లేఖ వ్రాశాడు. అందులో వాళ్ల మామయ్య కూతుర్ని దారుణంగా హేళన చేస్తూ వ్రాశాడు. ప్రేమ లేఖను కవర్లో ఉంచి శంకరం చెప్పిన ప్రకారం కవరు మీద మావయ్య ఎడ్రస్ రాసి పోస్టు చేశాడు. చేశాడే కాని ఏం కొంప ములుగుతుందో అని భయపడుతూనే ఉన్నాడు.

గుమ్మంలో పడింది.

శంకర్—భాస్కర్, మంచి నీళ్లూ విసినికర్రా దగ్గిరెట్టుకుని— ఇష్టదేవతా ప్రార్థనా ఇత్యాదులు ముగించి గుడికి తోలే మేక పోతుల్లా బెదురుతూ కవరు చించారు. అది వాళ్లనుకున్నట్టు గానే— భాస్కర్ మావయ్య రాసిన ఉత్తరం. వాళ్లమ్మాయిని భాస్కరమే చేసుకోవాలనే సిద్ధాంతం ఏమీ లేదని, ఇష్టం లేక పోతే లేదని తిన్నగా రాయక—ఈ డొంక తిరుగుడు దొంగ ఉత్తరాలు రాయవలసిన అవసరం లేదని— తను మరో సమ్మంధం చూసు కుంటున్నాననీ—అభిమానం ఉంటే పెళ్లికి మాత్రం తప్పక రావలసిందనీ సౌమ్యంగా రాశాడు మావయ్య.

భాస్కర్ ఉత్సాహానికి మేరలేక పోయింది. నేల మీద నడవడం మానేశాడు — కాలేజీకి — కాఫీ హోటల్‌కి పార్కులోకి—ఎక్కడికి వడితే అక్కడికి గాలిలోనే ఎగురుతూ వెళ్తున్నాడు.

భాస్కర్‌తోపాటు రోజులూ గాలిలో తేలిపో సాగాయి.

'స్టూడెంట్ ' జన భయంకర—పరీక్షలురానే వచ్చాయి. భాస్కరాన్ని ఇవేమీ అంత బాధించ లేదు. హాయిగా పూల రంగడిలా పేలుతూ గెంతుతూ కాలక్షేపం చేస్తున్నాడు. శంకర్ మాత్రం అహో రాత్రాలు కష్టపడి చదువుతున్నాడు. శంకరానికే మనసుండబట్టక—

"పోనీ గట్టిగా చదవమన్నావేమిట్రా పోనీ చెవులో ఒక ముక్కైనా దూరుతుందేమో!" అన్నాడు.

ఏ కళనున్నాడో ఏమో "సరే" అంటూ దాన కర్ణుడిలా వాడికో వరాన్ని పారేశాడు భాస్కర్.

ముసుగు తన్నిపెట్టి —శంకర్ చదువుతోంటే 'ఊ' 'ఆ' అంటున్నాడు.

మధ్య మధ్య మాత్రం "వీడు చదివే విషయాలు కూడా బాగున్నాయే" అనుకునే వాడు.

ఆ రోజు రిక్షాలో వెడుతూంటే కాబోలు.

"ఏరా శంకర్ ! మన ఇంగ్లీష్ 'నాన్‌డి టెయిల్డ్' పేరేమిట్రా ?" అన్నాడు. అడిగిందే మహా భాగ్యమని శంకరం దానిపేరూ— దాన్నెవరు రాశారో—కథా కమామిషూ వివరంగా చెప్పేడు. 'అనవసర ప్రస్తావన చేశా'వని తిడతాడేమోనని భయపడ్డూనే. భాస్కర్ చిరునవ్వు మాత్రం నవ్వేడు. . . . .

ఆ రోజు భాస్కర్ కాఫీ తాగుతోండగా

"కంగ్రాట్యులేషన్స్‌రా ! బ్రదర్ ! !" అంటూ ఎదర కుర్చీలో కూర్చున్నాడు 'మూర్తి' తన్ని కంగ్రాట్యులేట్ చెయ్యవలసినంత ప్రమాదం ఏం ముంచుకొచ్చిందో అర్థం కాలేదు భాస్కర్‌కి.

"అ దేం టి రా . . . . . . . జిడ్డు మొహం నువ్వూను. రిజల్ట్సు వచ్చాయిరా ! !"

భాస్కర్ ఆత్రుతగా పేపర్ తీసుకు తిరగే శాడు. సిగరెట్ కేసులో దాచిన నెంబర్లు పైకితీసి చూస్తున్నాడు. తృప్తిగా వూపిరి వదిలాడు.

"శంకర్ సెకండ్‌క్లాసులో పేసయాడు." సరే ఇంక శారద— అయ్యో ! కనీసం థర్డు క్లాసేనా రాలేదే బొత్తిగా సెకండ్‌క్లాసా ?

మరి 'లలిత'— 'సుధ' అయ్యో ఇద్దరూ జోడీగా ఉండి పోయారే ! ! !

సైజామెంట్సు చూస్తున్నాడు. లలితకీ సుధకీ ఓ మంచి ట్యుటోరియల్ కాలేజీ "సజెస్ట్" చేద్దా మనే సదుద్దేశంతో.

"ఓరి చవటా ! ! నీ నెంబర్ చూసుకోవేరా??" ఒళ్లు మండిపోయి పాలికేక వేశాడు మూర్తి.

"నేను పరీక్ష కెళ్లానేమిట్రా !" అని అన లేదు కాని "అన్నట్టు ! నేనూ వెళ్లానుగా !" అన్నట్టుగా చూసి "నా నెంబరెందు కుంటుందిలే" అంటూ మూడో తరగతి బండిని కలియజూశాడు.

"ఒరేయ్ బాబీ ! ఇక్కడున్నాన్రోయ్ !" అంటూ థర్డు క్లాసులోంచి తొంగి చూసి వెక్కి రించింది భాస్కర్ నెంబరు.

భాస్కరానికి ఆ పాదమస్తకం చెప్పరానంత చిరాకనిపించింది.

"మరో రెండేళ్లో మూడేళ్లో— సరదాగా కళాశాల్లోనే కాలక్షేపం చేద్దామనుకుంటే ! ! ఇదేమిటి ? ?. . . ఈ ఘోరం ? ? ?" చికాగ్గా పేపర్ని ఉండచుట్టి రోడ్డు మీదికి గిరవాటే శాడు.

" ఏందయ్యా ! వూరి సొమ్మనుదా — అట్టా విసిరేత్తవ్ " గొణుగుక్కుంటూ రోడ్డు మీద పడిన పేపర్ని తెచ్చుకున్నాడు హోటల్ అయ్యర్.

భాస్కర్ విసుక్కున్నది ఈ ఒక్క సందర్భం లోనేకాదు. వాళ్లనాన్న పోస్టల్ డిపార్టుమెంటులో ఉద్యోగానికి అప్లికేషన్ పెట్టమన్నప్పుడూ ఆ ఉద్యోగం వచ్చి దాంట్లో చేరమన్నప్పుడుకూడా ఇలాగే విసుక్కుని నానా అల్లరీ చేశాడు.

ఐదారేళ్లపాటు నించి ఉద్యోగం చేస్తోన్న భాస్కర్‌లో ఎంతో మార్పు వచ్చింది.

" బొత్తిగా నీకు — బుర్ర తక్కువేమోయ్ భాస్కర్ ! " అనే హెడ్ క్లార్కు మాటలు — తనకి శ్వాసక్రియ అంత సహజమై పోయాయి. తనలో చురుకుదనం చచ్చి పోయింది. మెదడు మొద్దుబారి పోయింది.

ఇప్పుడు తన మెదడుని ఆందమైన విషయాల్ని గురించి ఆలోచించడానికి కాకుండా — కూడికలు కూడ్డానికి — వయాపైసలు లెక్కపెట్టడానికి మాత్రమే ఉపయోగిస్తున్నాడు.

ఒక్క విషయంలో భాస్కర్ మెదడు అద్భుతంగా పని చేస్తోంది. పిల్లి మీద — ఎలక మీద వంక పెట్టి పెళ్లిని మాత్రం దిగ్విజయంగా వాయిదా వేయించ గలుగుతున్నాడు. నాన్న ఎన్నిసార్లు రమ్మన్నా " సెలవు దొరక లేద "ని — " ఆఫీస్ ఇన్‌స్పెక్షన " నీ వంక పెట్టి ఎగ్గొడుతున్నాడు.

భాస్కర్ మావయ్య భాస్కర్‌మీద ఆశ వదులు కుని వేరే సంబంధాల్ని వెతుక్కుంటోన్నా భాస్కర్ నాన్నమాత్రం వాటిని పడ నీయటం లేదు. రెండుమూడు సంబంధాల్ని —

" మా మేనరికానికి పోటీ వస్తారా ? " అంటూ నానా మాటలూ ఆడి చెడగొట్టేశాడు. ఎంత ప్రయత్నించినా భాస్కర్ మావయ్య కూతురికి సంబంధాలు దొరకటం మానేశాయి.

భాస్కర్ వాళ్ల నాన్న కళ్ల పడడు — వాళ్ల నాన్న మావయ్య కూతురికి సంబంధాలు రాని య్యడు — మామయ్య ఫలానా కారణంగా నేను

ముగ్గురు వ్యక్తులూ ఈ విష వలయం చుట్టూ తిరగడం తప్ప పరిష్కార మార్గానికి ఎవ్వరూ ..... ప్రయత్నించరు! ఎవ్వరికీ పరిష్కారం కావలసినట్టు కూడా కనపడదు — కాలం మాత్రం ఇవేవీ తనకి పట్టనట్టు — ఒక్కొక్కరికి జీవితానికి ఒక్కొక్క సంవత్సరాన్ని కలుపుతూ ముందుకి సాగిపోతోంది.

ఆ రోజు భాస్కర్ ఆఫీసు పని మీద హైదరాబాద్ వెళ్లవలసి వచ్చింది. పని పూర్తి చేసుకొని ఊరంతా దిమ్ముగా వుండడం చేత 'పబ్లిక్ గార్డెన్స్'కి వెళ్లి ఒకచోట పచ్చికలో చతికిలపడ్డాడు.

రకరకాల దీపాల వెలుగులలో ప్రపంచమంతా అందంగా, ఆహ్లాదకరంగా కనిపిస్తోంది. మరిన్నాళ్లూ ఈ అందం తనకి ఎందుకు కనిపించలేదు? ......

ఎంతసేపూ మీసాల మొహం — నాలుగు గోడలు, గుట్టలు గుట్టలుగా ఫైళ్లూ, క్లెండు పుస్తకాలూ, అద్దు పేపరూ, పేపరు వెయిటూ, కలం సిరా బుడ్డీ, చివాట్లూ, మెమోలూ, ఇన్‌స్పెక్షన్లూ, — — ఇదే తన ప్రపంచం — ఎప్పుడేనా వస్తే తాటకిలా మామయ్య కూతురూ, రావణాసురుళ్లా మామయ్య కల్లోకి వచ్చేవారు.

అందమైన జంటలు, పెళ్లయిన వారూ, కాని వారూ, చెట్టా పట్టా లేసుకుని — ఆనందానికి ఉత్సాహానికీ రూపెత్తి వచ్చిన వాళ్లల్లా — స్వేచ్ఛగా — గాల్లో పిట్టల కంటే ఉత్సాహంగా తేలిపోతో — తన జీవితం ఎంత నిస్సారమైనదో — తను చేతులారా తన జీవితాన్ని ఎలా వృథా చేసుకుంటున్నాడో గుర్తుకి తెస్తున్నారు.

తనలోని కోరికల్ని తను అజ్ఞాతంగా ఇన్నాళ్లూ అణచుకుంటున్నాడు? ఇది తన విధి హీనతా?? ఎందుకు ఈనివిధంగా ఆత్మవంచన చేసుకున్నాడు?? — — — భయంకరమైన మామయ్య కూతురి రూపం!!! — — —

"అయ్య బాబోయ్!!! ......" గట్టిగా కళ్లు మూసుకోబోయాడు. అదే! ఆశ్చర్యంగా వుందే ...... మామయ్య కూతురు కాదు!! సన్నగా పొడు పుల్లైపూవు లెత్తు రాజకుమారిలా — — — — వెన్నెల్లా పవ్వుతూ ...... అమృతాన్ని చిందిస్తూ ...... ఎవరూ?? ...... ఎవరా అజ్ఞాత సుందరి?? ఇన్నాళ్లూ తనలో అజ్ఞాతవాసం ఏర్పరచుకున్నది? ...... జ్ఞాపకాల్ని గతం వేపు ప్రసరింప జేశాడు. ....... శారద!! ...... అవును శారదే!!!

తను కాలేజి జనరల్ సెక్రటరీగా వుండగా ..... లేడీస్ జాయింట్ సెక్రటరీగా .... తనతోపాటు అనేకకార్యక్రమాల్ని నిర్వహించిన శారద తనంటే ప్రాణం పెట్టే ...... శారద!!!!

శారద సమక్షంలో తను యుగాల్ని క్షణాలుగా గడిపినట్టనిపించేది.

ఇదే పబ్లిక్ గార్డెన్స్‌లో. ఇదే సమయంలో కూర్చుని — ఒకరి కేసి ఒకరు చూసుకుంటూ ..... ఏం మాట్లాడుకోవాలో తెలియక ...... మౌనంగా గంటలు — గంటలు — కాలక్షేపం చేసేవాళ్లు.

ఆరోజు .......... తను శారదతో ఎన్నో సంగతులు చెప్పాలనుకున్నాడు — ఏమి చెప్పాలో — ఎలా చెప్పాలో? — తను శారదని గురించి ఏం ఆలోచిస్తున్నాడో తనకే తెలియని మూగ బాధతో సతమత మౌతున్నాడు .... పోనీ! శారదే తన్ని అడక్కూడదు? ... ఏమని?? ... ఏమో! .......... తనకే అర్థం కాదు..

"శారదా???" అన్నాడు తను.

"ఊఁ" గోముగా అంది శారద.

"నీతో ఓ ముఖ్యమైన ........"

"ఊఁ...... చెప్పు భాస్కర్ — !" గొంతులో వచ్చి పెలక్కాయ పడ్డట్టయింది. శారదని తను ప్రేమిస్తున్నాడా! అలాగని అంటే శారద చివాట్లెయ్యదు గదా! ..............

ఒకవేళ శారద ఒప్పుకుంటే .... నాన్న .... అమ్మ బాబోయ్ — నాన్న!!! ....... అందులో తన కులం కాని పిల్లని! — — వంటింట్లో కుర్చీపీట మీద కుంచుని వాళ్లమ్మ దూలాన్నించి వేళ్లాడే తాడును మెడకి తగిలించుకో బోతున్న దృశ్యం కనబడే సరికి భయంతో కళ్లు మూసుకున్నాడు భాస్కర్.

"ఊఁ మాట్లాడవేం భాస్కర్!" తియ్యగా — సిద్ధహస్తుడి చేతిలో పలికేవ వీణలా అడిగింది శారద.

"అబ్బే ..... రేపు మన సాంస్కృతిక కార్యక్రమానికి జడ్జీగారిని ఆహ్వానిస్తే ఎలాగుంటుందంటావ్!"

పున్నమి చంద్రుడిలా హాసిస్తున్న శారద ముఖం మీద మేఘపు పొర పరుచుకున్నట్లయింది.

"ఏకాంతంలో — మధురమైన సాయం సమయంలో, మనసిచ్చిన కన్నె కసమీపంలో — నువ్వు మాట్లాడదలుచుకున్న — ముఖ్య విషయం ఇదా? దౌర్భాగ్యుడా!!" అన్నట్టు ముఖం చిట్లించింది.

# చక్రనేమి

* * * *

* టాక్సీ కోసం తిరిగి శ్రమ పడ్డం కన్న హాయిగా బస్సు కోసమే కాచుక్కూచోవచ్చు!

* బస్సు కోసం పడిగాపులు పడి కాలం వృథా చేయడం కన్న తిన్నగా నడవొచ్చు ఆఫీసుకి!

* నడిచి వెళ్ళడమేం ఖర్మ! శుభ్రంగా ఇంటికెళ్ళి రెస్టు తీసుకోవచ్చు!

* ఇంట్లో గోలెవడు భరిస్తాడు? అందుకని ఆఫీసుకి నడిచి వెళ్ళడమే ఉత్తమం!

* నడిచి వెళ్ళడం - వృథాశ్రమ! అంతకన్న బస్సుకి వెయిట్ చేయొచ్చు!

* బస్సు కోసం కాలం వృథా చేయడం కన్న శ్రమపడి టాక్సీనే వెతికి పట్టొచ్చు!

* టాక్సీ కోసం తిరిగి శ్రమ oooooooooo
oooooooooooooooo

Jayadev

# ఎన్నో రకముల క్లియర్‌టోన్ యింట్లో వాడుకొనే ఉపకరణములు

Kleertone

| | | | | |
|---|---|---|---|---|
| ఇంపీరియల్ ఇస్త్రీ పెట్టె | కెటిల్ | ఇస్త్రీ బల్ల | టోస్టర్ | సింగిల్ హాట్ ప్లేట్ |
| టేబుల్ మరియు సీలింగ్ పంకాలు | హాట్ ఫుడ్ క్యాబినెట్ |  వాటర్ బాయిలర్ | కుకింగ్ రేంజ్ | జెనరల్ రేడియో & అప్లయన్సెస్ లిమిటెడ్<br>బొంబాయి . కలకత్తా . మద్రాస్<br>ఢిల్లీ . బెంగుళూరు<br>సికిందరాబాదు . పాట్నా<br>JWT-GRA. 2080 EA |

ASP/GM/23 TEL

పళ్లు రావటమా?

వాతమా?

కడుపు నొప్పా?

# మేనర్స్ గ్రైప్ మిక్శ్చర్

యివ్వండి

చిరునవ్వుల

చిందులాట చూడండి






ఇప్పుడు ఉల్లాసకరమైన ఎరుపు సిలిరంగుల్లో ప్యాకింగ్

ఆధునిక తల్లులు తమ పిల్లలకు మేనర్స్ గ్రైప్ మిక్శ్చర్ యిస్తారు. నోటికి యింపైన రుచి పరిశుద్ధముగా ప్యాక్ చేయబడినది.

అదృష్టపాపలు పొందుతారు మేనర్స్ గ్రైప్ మిక్శ్చర్

GEOFFREY MANNERS & COMPANY LIMITED

( ఆత్మ వంచన ) పేరిట ఇలాటి బంగారపు అవకాశాలు చాలా జార విడిచాడు.

తను మరో కులం అమ్మాయిని చేసుకుంటే తల్లిదండ్రులేదో అయిపోతారనుకున్నాడు. తన పక్కింటి 'మోహన్' వేరే కులం అమ్మాయిని చేసుకున్నాడని వాళ్ల ( మోహన్ ) అమ్మా, నాన్నా, కక్షకడితే — తన తల్లిదండ్రులే వాళ్లకి నచ్చ చెప్పి తండ్రీ కొడుకుల్ని ఏకం చేసిన సంఘటనని తల్చుకుని ........ తనెంత కుమిలి పోయాడో ! మోహన్ ధైర్య సాహసాల్ని నాన్న మెచ్చుకుంటోంటే తన చేత కాని తనాన్ని వేలెత్తి చూపిస్తున్నాడనిపించేది— ఈ ఉద్యోగం పుణ్యమా ...... అని తను జీవచ్ఛవమే అయిపోయాడు.

ఈ రోజు తనలో కొత్త భావాలూ, కొత్త వూహలూ పుట్టుకొస్తున్నాయ్! — తను తప్పకుండా శారదను కలుసు కుంటాడు. — తప్పక శారద తనని స్వీకరిస్తుంది. అమ్మా నాన్నా మోహన్ని మెచ్చుకున్నట్టే తన్ని మెచ్చుకుంటారు. హుషార్‌గా సిగరెట్ ముట్టించి పొగతోపాటు వూహాలల్లేస్తున్నాడు గాలిలో . . . . . . . . . .

" హల్లో ! బాచీ ! ! " ఒక పోలికేక .... వెను వెంటనే భుజాలు పట్టుకుని ఒక కుదుపూ — వూహాల్లోంచి పబ్లిక్ గార్డెన్స్‌లో పడ్డాడు భాస్కర్.

" ఎవరు ? ఏమిటి ? ? ఎందుకు ? ? ? " మూడు ప్రశ్నార్థకాలతో ఉలిక్కిపడి బుర్ర తిప్పి చూశాడు.

"శం..... క ....... ర్" అప్రయత్నంగా భాస్కర్ నోట్లోంచి వెలువడ్డాయి మాటలు.

" అవున్రా ! నేనే — — ఎప్పుడొచ్చావ్! ఏమిటీ కూర్చోవటం ! ! పద ఇంటికి పోదాం ! ! "

" అది సరేగాని ....... నువ్వేం చేస్తున్నావ్ — ఏమిటి కథ ? " అన్నాడు భాస్కర్.

" అబ్బాయ్! నేను శక్రటేరియట్‌లో యు.డి.గా వుంటున్నాను. వయస్సు ఇరవై తొమ్మిది. వివాహం అయింది. నా కిప్పుడు ముగ్గురు పిల్లలు కూడారా ! అహ్ — హ్హ హ్హ " విరగబడి నవ్వేడు.

" మరి విషయం ఎప్పుడూ పేపర్లో పడలేదెందుకురా ? " అమాయకంగా అడిగాడు భాస్కర్.

" ఎందుకు పడుతుందిరా ? ? "

" అదేరా నీకు ముగ్గురు పిల్లలు పుట్టేరు కదూ ! " అన్నాడు 'నీకు' అన్నప్పుడు తన వేలితో శంకర్ గుండెల మీద పొడుస్తూ.

" ఏ చచ్చు విట్టు ఏడిసినట్లే వుంది కాని .... పద ....... ఇంటికి " అంటూ బిబ్బ పట్టుకు లేవదీసి లాక్కెళ్తున్నాడు శంకర్.

"మరి మీ శ్రీమతి. . . . ."

"అదేరా ! మన జాయింట్ శక్రటరి. . . . శారద లేదూ. ఆ అమ్మాయిరా. . . ?" భాస్కర్ చేష్టలుడిగి స్థంభించి పోయాడు. తను రమ్యంగా నిర్మించుకున్న హర్మ్యాన్ని ఒక్క దెబ్బతో నేల మట్టం చేశాడు— శంకర్. బరబరా లాక్కెళ్తుంటే యాంత్రికంగా వెళ్లడం— వాడి మాటల మధ్య "ఊఁ— ఆఁ" అనడం మినహాగా ఏం చెయ్యటం లేదు.

"అదేమిట్రా ? ఆ రోజుల్లో అంత హుషారుగా ఉండేవాడివి ? ఇలా మొద్దులా తయారయావేమిట్రా ?. . . . మీ మామయ్య గాని బలవంతంగా— తన కూతుర్ని— నీ మెళ్లో కట్టేశాడేమిట్రా ?"



"నేను. . . పోస్టల్ డిపార్టుమెంటులో పని చేస్తున్నానురా! ఆఫీసుపని మీద ఈ వూరొచ్చాను. ఇంకా భోం చెయ్యలేదు." ఏం మాట్లాడుతున్నాడో తనకే తెలియడం లేదు.

శంకర్ ఇల్లు చేరేసరి— పిల్లలు ముగ్గురూ కొంప టాపులేపేసేట్టు కేకలేస్తూ అల్లరి చేస్తున్నారు. ఎంత అదృష్టవంతుడు. . . . శంకర్ !

శంకర్ని చూస్తూనే పిల్లలు బల్లులతో పాటు గోడలకు అతుక్కుపోయారు.

"ఒరే ! గోపీ ! బాబీ ! రాజూ ! ! మీ బాబాయ్‌రా ! ! రండి ! రండి !" ఉత్సాహంగా పిలిచాడు శంకర్. పిల్లలు ముగ్గురూ బంతుల్లా ఉన్నారు.

"బాబాయ్ ! బాబాయ్" అంటూ చుట్టు ముట్టేశారు.



ప్రియుడు: ఉమా! నువ్వంటే నాకు ప్రాణం! నిన్ను తప్పక పెళ్లి చేసుగుంటా...

ఉమ: నిన్ను నమ్మడంఎలా?

ప్రి: నువ్వూ అదే మాటా? లతా, వసంతా, కూడా అలాగే అన్నారు. ఏం ఆడవాళ్లో...!

కె. రంగారావ్ (కాకరపర్రు)



"శారూ ! ! మా బాచిగాడొచ్చాడు" అని వంటింటికేసి తిరిగి కేకేశాడు.

చేతిలో కాఫీ కప్పులో శారద ప్రవేశించింది. భాస్కర్ ముఖం భూమిలోకి దించుకుని కూర్చున్నాడు.

"ఏం భాస్కర్ ? మమ్మల్ని పూర్తిగా మర్చిపోయినట్టున్నావేం ? పోనీ నీ ప్రాణ స్నేహితులేనా జ్ఞాపకం లేరా ?" అంది నవ్వుతూ కాఫీ కప్పు చేతి కందిస్తూ. భాస్కర్ మతిపోయిన వాడిలా. బుర్ర పైకెత్తి చూశాడు.

భాస్కర్ కళ్లు బైర్లు కమ్మేయి గదిలో వస్తువులన్నీ గిరగిరా తిరిగి పోతున్నట్టు కనిపించాయి భాస్కర్‌కి. ఒక్క నిమిషం రక్త ప్రసారం ఆగి పోయినట్టనిపించింది.

ఏమిటిది ?. . . కలా. . . నిజమా ? ? ? ఏమిటీ విపరీతం ? ? ? ఈమె శారదేనా ! ! లేక తన్ని ఏడిపించడానికి శంకర్ కోశాడా ? ?. . . . పరిశీలనగా చూశాడు అబ్బే అనుమానం లేదు. . . . ఈమె శారదే ! !. . . అయితే కొంచెం నల్ల బడింది. అలాగట్టు వల్చ బడింది. కాస్త ఒళ్ళు చేసుకున్నట్టుంది. . . కాస్తేం ఖర్మ ? ? చూడ్డానికి భయమనిపించేంత ఒళ్లు. . . అబ్బ. . . ఈ శంకర్‌గాడు ఆమెని చూసి ఎలా భరిస్తున్నాడు చెప్మా ? ?

తను కూర్చున్నా — భోంచేస్తున్నా — శంకర్‌తో— శారదతో— మాట్లాడుతోన్నా— శంకర్ దురదృష్టాన్ని గురించే ఆలోచిస్తున్నాడు— శంకర్ శారదలు వెకాకోళా లాడుకుంటోన్నా— నవదంపతుల్లా వోర చూపులు చూసుకుంటూ ముసి ముసి ముసిగా నవ్వులు నవ్వుకుంటోన్నా భాస్కర్‌కి కడుపులో దేవుతోన్నట్టనిపించింది.

భోజనాలు పూర్తయిన తర్వాత స్నేహితులిద్దరూ డాబామీదికి చేరి కబుర్లలోకి దిగేరు. తన భార్య ఈ నికృత రూపాన్ని గురించి— భరించలేక తను పడే అవస్థని గురించీ చెబుతాడనీ— వాణ్ణి తను ఏదో విధంగా అనునయించాలనీ ఆలోచిస్తున్న భాస్కరానికి ఆశాభంగమే ఎదురయింది. శంకర్ ఎంత సేపూ తన అదృష్టాన్ని తను శారద వల్ల పొందుతోన్న పొందబోతోన్న సుఖ శాంతుల గురించీ వూరికే మాట్లాడేస్తోంటే భాస్కరానికి మతి పోతోంది.

తనలో తీవ్రమైన. . . మానసిక సంక్షోభం ఆరంభమైంది. తనలో నిబిడీకృతమై ఉన్న తన వూహలూ— జీవితపు విలువలూ ఎక్కడో పెడదారినపట్టే యనిపిస్తోంది. యదార్థ జీవితానికి, తన వూహా లోకాలకీ మధ్య— బ్రహ్మాండమైన మానసిక సంపద— సంతృప్తి ఏదో ఈ దాంపత్య జీవితంలో ఉన్నదనిపిస్తోంది. అదే శంకర్‌ని తన భార్యలోని భౌతిక పరిణామాన్ని చూడనియ్యడం లేదు.

తనెన్నడైనా శారదని మానసికంగా అర్థం చేసుకోడానికి ప్రయత్నించ గలిగాడా !— కేవలం ఆమె భౌతిక సౌందర్యాన్ని ఆరాధించ గలిగాడు. ఒక వేళ తను శారదని చేసికొని ఉంటే. . . శారద ఇలా కాకుండా ఉండేదా ?. . . అసంభవం ? ?. . . అప్పుడు ఉభయుల జీవితాలూ నరకప్రాయమై ఉండేవి కదా ! శంకర్‌ని చేసుకున్న. . . శారద. . . అదృష్టవంతురాలు. అవును. శారద తన ఈ రూపానికి తనెంత వరకూ కారకురాలు? కావచ్చు— కాకపోవచ్చు . . . మరి మావయ్య కూతురు వి...శా ... ల. . . . అంతే. . . అప్రయత్నంతో భాస్కర్ గుండెలు బరువెక్కి పోయాయి. నేత్రాలు ఆర్ద్రమై పోయాయి. తన మూలంగా 'విశాల' ఎంత చిత్తక్షోభ ననుభవిస్తోందో. . తను అర్థం చేసుకోలేక పోయాడు గాని విశాల తనంటే ప్రాణం పెడుతుంది. తన పిచ్చి వూహాలతో— పిచ్చి ఆదర్శాలతో ఒక అమాయిక జీవిని ఎంతగా ఉసురుపెట్టేడో? ఒక నిండు జీవితాన్ని సర్వ నాశనం చేశాడు.

అవును తనకిప్పుడు కనువిప్పు కలిగింది !. . . . తనిప్పుడు జీవితపు విలువల్ని గ్రహించ గలిగాడు. తనింక జీవితంలో పొరపడ దల్చుకోలేదు.

అందుకే కాగితం కలం తీసుకుని ఉత్తరం రాయడం మొదలెట్టేడు.

"ప్రియమైన మామయ్యకు !" అని రాసి కొట్టేసి— "ప్రియమైన విశాలా !" అంటూ మొదలెట్టేడు. 




## జరిగిన కథ

మధు, స్నేహితురాలు శారదకు తన బాల్య గాథను చెప్పగా, ఆమె దాన్నంతా నవలగా చిత్రీకరిస్తుంది ... చిన్ననాటనే తల్లిని కోల్పోయిన మధు, తండ్రికి కూడా దూరమవుతాడు. తాతగారింట్లోనే అన్నయ్య సూర్యం, చెల్లెలితోను వుంటూవుండగా, జమీందారుగారి ఇరువురు కూతుళ్ల స్నేహం లభిస్తుంది. తాతగారి మరణంతో మధు తాతగారి సొంత వూరు చేర్తాడు. అక్కడి పరిస్థితులు మధుకు బాధాకరంగా ఉంటాయి. జానకిభర్త మనసు మారినందుకు అంతా సంతోషిస్తారు. మామయ్యకు ఇష్టంలేకపోయినా, మధు స్కూల్లో చేరతాడు. హెడ్ మాస్టరు మధు ప్రతిభను చూసి సంతోషిస్తాడు. విశ్వనాథం మధును సతాయించటాన్ని సుందరమ్మగారు ప్రతిఘటిస్తుంది. అంతేకాదు, మధుపట్ల నానాటికి విశ్వనాథానికి ద్వేషం పెరిగిపోవటం, సుందరమ్మగారికి బాధాకరంగా పరిణమిస్తుంది. తోటలో జరిగిన దొంగతనాలకు మధు బాధ్యుడవుతాడు. ఈవిషయాన్ని తెలిసికొన్న విశ్వనాథం మధును రక్తం కారేటట్లు కొడతాడు. దగ్గరి బంధువైన డాక్టర్ కేశవరావ్ పరిచయం మధులో కొత్త ఉత్సాహాన్ని కల్పిస్తుంది. ఉద్యోగంలో చేరిన సూర్యానికి ఆ ఇంటినుంచి విడిపోవటం తప్పనిసరి అవుతుంది. అనతికాలానికే సూర్యం గృహస్థుడవుతాడు. ఇందిర ఆతనికి తగిన భార్య. మధుకు ఇందిర వాత్సల్యం లభిస్తుంది. పై చదువులకు పట్నం వెళ్లిన మధు సెలవుల్లో ఇంటికి వస్తాడు. అయిష్టంగానే విశ్వనాథాన్ని చూడటానికి వెళ్తాడు. అక్కడ చిన్న ఘర్షణ జరుగుతుంది. పరీక్షలు వ్రాసి ఇంటికి వచ్చిన మధులో ఏదో వెర్రి వుందని ఇందిర గ్రహిస్తుంది.

## 16

మధు కేశవరావు వాళ్లింటికి వెళ్లినా విస్తరి మీద నించున్నట్టే నించుని రుక్మిణిని కాస్త పరామర్శించి మతిస్థిమితం లేనివాడిలాగే ఓ గంటకంతా ఇంటికి వచ్చేశాడు. ఇందిర విజయ్‌కి చొక్కా తొడుగుతూ గుమ్మందగ్గిర నించుంది— మధుని చూసి ఎప్పటిలా పల్కరించకుండా తలతిప్పేసుకుని కొడుకు చొక్కా గుండీలు సర్దసాగింది— అదేం పట్టించుకోకుండా వస్తూనే ఆతృతగా అడిగాడు మధు— "వదినా! ఉత్తరం వచ్చిందా?"

"వచ్చింది."

"వచ్చిందా? మరేం? ఇంకా చెప్పవేం?"

"ఇప్పుడేగా వచ్చావు?"

"సర్లే! కవరేనా?"

"ఆఁ కవరే, ఇస్తానుండు".

"ఎక్కడుంది? నేను తీసుకుంటాను." అంతులేని నిరీక్షణ తాలూకు ఆరాటం మధు చేష్టల్లో గోచరించింది.

"నీ పెట్టెలో పెట్టాను. తీసుకో"— ఇందిర కొడుకుని బుజంమీద వేసుకుని దొడ్లోకి వెళ్లిపోయింది. పెట్టె తీసి ఉత్తరం చూసుకున్న మధు కోపంతో పిచ్చివాడయ్యాడు— "వదినా!" ఒక్క గావు కేక పెట్టాడు— దొడ్లోకి పూర్తిగా వెళ్లని ఇందిర వెనక్కి వచ్చింది— "పిల్చావా?"

"ఎవరు చించారీ కవరు?"

"మీ పెద్ద మామయ్యగారు."

"వాడెప్పుడొచ్చాడిక్కడికి?"

"పొద్దు జవాను వచ్చేసరికి ఆయనిక్కడే ఉన్నారు. చొరవగా ఉత్తరం చించేస్తుంటే......."

"నువ్వు నోరు మూసుకుని వూరుకున్నావు. అంతేనా ? ఉత్తరం జాగ్రత్తని చెప్పలేదూ ? చూస్తూ వూరుకున్నావా?"

ఇందిర ప్రాన్పడిపోయింది. మధుని ఎన్నడూ ఆ స్థితిలో చూసి ఎరుగదు— నెమ్మదిగా అంది — "ఆయన అందుకుని చించేస్తుంటే ఏమీ అనలేకపోయాను."

"ఛీ ! మీరు మనుష్యులా ? బుద్ధిలేని వాళ్లు జంతువులు కూడా నయం మీకన్నా."

సుందరమ్మ కంగారుగా వచ్చింది— "ఏమిట్రా అరుపులు? నువ్వు కాలేజీలో......."

"నోర్ముయ్!"

"ఏమిటా కోపం?"

"హు! కోపం!" మధు కోపంతో పళ్లు నూరుకున్నాడు— "మీతో వాగుడుకాదు. ముందు వాడి పని...... వాడి పని చెప్తాను." ఉత్తరం జేబులో కుక్కుకున్నాడు.

"మధూ! ఒరేయ్!"

విన్పించుకోని మధు గజానికో అంగ వేసుకొంటూ వెళ్లిపోయాడు.

సుందరమ్మగారు భయపడిపోయింది—

"అక్కడేం కుమ్ములాడుకుంటారో ఏమిటో నమ్మాయ్ అసలే ఇలా వచ్చిందేమో అని ఏడుస్తుంటే పైగా వీళ్ల గొడవేమిటి? నెమ్మదిగా వెళ్లొస్తాను"

పెద్దకాలం వచ్చేసిన సుందరమ్మగారు దడదడలాడుతూన్న గుండెలతో లేచింది.

మధు ఆవేశంతో వూగిపోతూ మెట్లు ఎక్కేసరికి కృష్ణుడు వాకిట్లో ఎదురుపడ్డాడు— "ఏం బావగారూ బహుకాల దర్శనం."

"ఏడిశావ్‌లే. పెదనాన్నగారెక్కడ?"

"ఏమిట్రా ఆ వ్యంగ్యం? ఏమిటి కథ?"

"నోరు మూసుకు పిలవ్వోయ్! ఇంట్లో ఉన్నాడా?" మధు అసహనంగా విరాగ్గా అరిచాడు.

కృష్ణుడు తెల్లబోయాడు— "పెదనాన్నా? ఉన్నాడు. పిలుస్తాను. కూర్చో."

"హు! కూర్చో, కూర్చోటానికికాదు రావటం. మర్యాదలు తర్వాత. వాణ్ణి పిలు."

కృష్ణుడు మధు చాలా వేడిగా ఉన్నాడన్న సంగతి అర్థంచేసుకున్నాడు. "ఒక్క క్షణం అయోమయంగా చూసి లోపలికి వెళ్లబోయేసరికి విశ్వనాథం ఎదురుపడ్డాడు. వస్తూనే మధునిచూసి వెటకారంగా నవ్వుతూ అన్నాడు.

"ఓహో! మధుసూదనరావుగారా? కాలేజిలో ఘనకార్యం చేసినట్టున్నారే!"

"నోర్ముయ్! బుద్ధిలేని పశువా! నువ్వుచేసే నీచాలకన్నా నేను చేసింది ఘనకార్యమే. ముమ్మాటికీ—" మధు కోపంతో వూగిపోయాడు.

అనుకోని సంఘటనకి విశ్వనాథం క్షణం తెల్లబోయాడు. మరుక్షణంలోనే తన కలవరపాటు కప్పిపుచ్చుకొంటూ దురుసుగా అన్నాడు— "ఏమిట్రా. మహా వాగుతున్నావ్. ఒళ్లు భద్రం."

"వాగుడంతా నీది. చేసింది చాలక వెటకారం కూడానా? ఏదీ? మళ్లా వాగు."

తోంటేనే కాలేజీనుంచి వెళ్లగొట్టారు.''

మధు దాదాపు పిచ్చివాడయ్యాడు. విసురుగా రెండంగలేపి విశ్వనాథం చొక్కా గుండెలమీద గుప్పిట్లో పట్టుకుని ఒక వూపు వూపాడు— "ఇప్పుడు చెప్పు. ఇలా వాగితేనా నన్ను పొమ్మన్నారు? నీకు బాగా తెలుసుకదూ? చెప్పవేం?''

అడుగంటిపోయిన అభిమానంతో విదిలించుకోటానికి ప్రయత్నిస్తున్న విశ్వనాథాన్ని గుప్పిట్లో బిగుంచుకున్నాడు మధు— "నిన్ను నాలుగు తన్నే దిక్కేవిట్రా? ఒళ్లు భద్రం ఎవరికిప్పుడు? నీ ఎంగిలి మెతుకులు తిని బ్రతికే చవటననుకున్నావా మాటిమాటికీ నువ్వా నన్ను హెచ్చరిస్తావ్? ఏం? మాట్లాడవేం?'' కసికొద్దీ మరో వూపు వూపాడు.

దిక్కు చచ్చిపోయిన కృష్ణుడు లోపలికి పరిగెత్తాడు.

"ఎటుపోతావ్? చేతిలో చిక్కావ్. నిన్నేం చెయ్యాలి? నన్నేం చేశావో గుర్తుచేసుకో— ఒక్కసారి. నీ యిష్టం వచ్చినట్టు చిత్రవధ చేశావే! జ్వరంతో మూలుగుతోంటే కాలితో తన్నావ్. కాలు తెగి ఏడుస్తోంటే నవ్వుకొంటూ పోయావ్. దొంగతనం అంటగట్టి స్తంభానికేసి కొట్టావ్— అంతేనా? నేను చేసిన దారుణాలు భరించలేక పోయావ్ కదూ? నన్ను బాగు చేస్తానని కంకణం కట్టుకున్నావ్ కదూ? నా భవిష్యత్ కోసమే పాటు పడ్డావ్ కదూ? ఎంత చిత్రం! నీ చేతిలో మస్తై పోవాల్సిన నేను నిన్ను నిలవెయ్యటం ఎంత ఘోరం! నా కిచ్చిన ప్రతి బహూమానం తిరిగి నీకు అందించక పోవటం— నీ ఋణం తీర్చుకోవటానికి నేను ప్రయత్నించకపోవటం— ఇదంతా కృతఘ్నతే కదూ? నీ పాపం పండింది. అందుకే నేను వచ్చాను. నా ఉత్తరం చించి మంచి అవకాశం ఇచ్చావ్.''

విశ్వనాథం మొహంలోకి తీక్షణంగా చూస్తూ ఈ క్షణంలోనో మరొక్షణంలోనో తన్నటానికి సిద్ధమవబోతూన్న మధూ వీరావేశం చూసి పార్వతీ, సావిత్రీ కంపించిపోయారు— విశ్వనాథం ఇంటికి వచ్చి మధూ చదువుమాట చెప్పి నవ్వుకొంటూంటే అంతలోనే ఈ ఉపద్రవం ముంచుకు వచ్చింది.

భర్త మధు చేతుల్లో తన్నులు తినగలడేమో నన్న అనుమానం పార్వతిని భయపెడుతోంటే కంగారుగా ప్రాధేయపూర్వకంగా అంది— "ఏదో పొరపాటై పోయిందిలే నాయనా! ఈసారికి కోగించుకోక వెళ్లిపో బాబూ!''

"ఆ మాట ఈ పెద్దమనిషి ఒప్పుకుంటాడేమో చూడు. పైగా నేను కాలేజీలో ఘనకార్యం చేవచ్చానని వెటకారం! ఛీ! నీ ఒంటిమీద చెయ్యి వేస్తే నాకే సిగ్గుచేటు. నీ పెంపకంతోనైనా నీ బుద్ధిలేని వెధవని కాలేదు. వదిలేస్తున్నాను. కాస్త నోరు సంభాళించుకుని ఒళ్లు భద్రంచేసుకుని మా మాట్లాడు. భద్రం చేసుకోవటం నీకు బాగా తెలుసు కదూ?''— మధు వెటకారంగా నవ్వుతూ చేతులు దులుపుకున్నాడు.

విశ్వనాథం పరిస్థితి వర్ణనాతీతం. కోపిన కంద గడ్డలా ఎర్రబడిపోయాడు. మరిగేనీళ్లలో పడ్డ దుంపలా ఉడికి పోయాడు— అవమాన భారాన్ని వెనక్కినెట్టి సాధ్యమైనంత విసురుగా దురుసుగా అన్నాడు— "రౌడీ వెధవ్వి కాలేజీలో డిబారై వచ్చి మధ్య నామీదట్రా నీ తిరుగుబాటు?''

"నీకు మతికూడా పోయిందా? తప్పతాగేసి ఉన్నావా? నేను అడింగిదేమిటి? నువ్వు చెప్పేదేమిటి? డిబారే అవుతాను. ఇంకోటౌవుతాను. చోరీలు చేస్తాను. ఖూనీలు చేస్తాను— నా మంచిచెడ్డలేమీ నీ కంటవు. అది నీకు అనవసరం. నా ఉత్తరం ఎందుకు చించావనే నేనడుగుతున్నాను. తెలుస్తోందా?''

విశ్వనాథం ఏమీ మాట్లాడలేక పోయాడు.

"చిన్నతనంలో నాకు గోపాలం రాసిన ఉత్తరం జబర్దస్తీగా తీసేసుకున్నావు. గుర్తు ఉందా? ఆ కసి తీర్చుకోలేక దాచుకున్నానింతవరకూ. ఈనాడు కూడా ఇంత అధికారం వెలగబెట్టటానికి ఎన్ని గుండెలోయ్ నీకు?—ఊళ్లో పేరుమోసిన పెద్దమనిషివి. కాబోయే పంచాయతీబోర్డు ప్రెసిడెంటువి. ఇంతమాత్రం సభ్యత తెలీకపోయిందా నీకు?— డబ్బు జిమ్మి వోట్లుకొనే ఖామందువి— నీకు సభ్యతేమిటి నా వెర్రి?— ఆ ఉత్తరం మీది అడ్రసు నీ దనుకున్నావా? నీదికాని ఉత్తరం నువ్వు చించకూడదనే చిన్న విషయం తెలీలేదూనీకు?''

"ఉడుకు మోతు వెధవా! నీ రహస్యం బయట పడిందని ఏడుపు కాకపోతే.......''

"ఇప్పటికైనా గౌరవం కాపాడుకోవాలంటే నోరు మూసుకు మరీ తప్పు ఒప్పుకో— నా రహస్యం బట్టబయలైందని ఏడవటానికి అది రహస్యం కానేకాదు పబ్లిగ్గా లెక్చరర్‌తో ఘర్షణ పడ్డాను. కాలేజీ రూల్సు ప్రకారం డీబారయ్యాను.— దానికి నేను గర్వపడుతున్నాను కూడా. కాని నా ఉత్తరం నా అనుమతిలేకుండా చించే అధికారం ఎవ్వరికీ లేదని చెప్పటానికీ— నీకో పాఠం నేర్పి వెళ్లటానికీ వచ్చాను— వ్యభిచారం— దొంగతనం— జూదం— హత్యలు ఇవేవీ నీ తప్పుకన్నా పెద్దవికావు. నీ వంటి చీడపురుగులే ప్రజలకూ దేశానికీ అసలైనశత్రువులు''

మదపుటేనుగులా కదం తొక్కుతూన్న మధుని చూస్తూ విశ్వనాథం మాటలు దక్కి నిలబడి పోయాడు. సత్తువ ఉడిగిపోయిన సుందరమ్మగారు ఒగర్చుకుంటూ వచ్చి మధుచెయ్యి పట్టుకొంది— "నా మాట విను బాబూ! జరిగిందేదో జరిగిపోయింది



ళారు.''

మధు మండిపడ్డాడు— "నవ్వుతారు! నీ కొడుకు సంగతి వచ్చేసరికి నలుగురూ నవ్వుతారు— ఇంత పాటి అభిమానం— గౌరవం— వ్యక్తిత్వం మరెవ్వరకూ లేవని నవ్వుతారు, అంతేనా?"

తన తరపున తల్లీ పెళ్ళాం సంజాయిషీలు చెప్పుకోవటం క్షమాపణలు కోరటం విశ్వనాధానికేం నచ్చలేదు— అడ్డంగా దిగి దబాయించటానికి సిద్ధమయ్యాడు— "ఉత్తరం చూసినంత మాత్రాన తప్పేమిటోయ్ మహా?"

"ఛీ! నీకు బుద్ధేకాదు. సిగ్గుకూడా లేదు. నా ఉత్తరం నువ్వుచూసినా తప్పులేదు. నీ పెళ్ళాన్ని ఎవరుచూసినా తప్పులేదు. నీదృష్టిలో ఏ వస్తువూ ఎవరికీ సంబంధించిందికాదు—

"ఎందుకు? నీకు ఏళ్ళు పెరుగుతున్నాయి. అంతే ఇప్పటికైనా ఒక గుణపాఠం నేర్చుకో— జీవితంలో మరెప్పుడూ ఇలాంటి వెధవ పని చెయ్యకు. అసలు నీవంటి తప్పుడు మనిషి కెదురుపడటం నాకే సిగ్గుచేటు— మరోసారి హెచ్చరిస్తున్నాను. నా విషయంలో ఒళ్ళు భద్రం చేసుకొని తిరుగు."

మధు మరోక్షణం నిలబడకుండా ఛీత్కరించుకొంటూ చీడీలు దిగిపోయాడు.

సుందరమ్మగారి కళ్ళు కన్నీళ్ళతో నిండిపోయాయి. కొడుకు మొహం చూడలేక నెమ్మదిగా దొడ్లో కెళ్ళిపోయింది.

ఎక్కడెక్కడో తిరిగి మధు రాత్రి చాల పొద్దుపోయాక ఇంటికి వచ్చాడు. ఇందిర మౌనంగా అన్నంపెడితే తిని తప్పుచేసిన వాడిలా తల దించుకుని లేచాడు. పడుకోవటానికి సిద్ధపడిన సూర్యం మధూ కోసమే నిరీక్షిస్తూ కూర్చున్నాడు. మధు వంటింట్లోంచి రాగానే కొంచెం మందలించాలన్న ఉద్దేశ్యంతోనే అన్నాడు—"మామయ్యతో ఏదో ఘర్షణ పడ్డావట?" వరండాలోకి వెళ్తున్న మధు ఆగిపోయి సూటిగా చూశాడు—"ఘర్షణ? కాదు. అతణ్ణి తన్నకుండా వదిలేశాను. సంతోషించండి."

"మధూ! ఎందు కంత దురుసుగా మాట్లాడ్తావ్? చనువుగా ఉత్తరం తీసినంతమాత్రాన ..."

"అన్నయ్యా!" తీక్షణంగా చూశాడు మధు.

"మరెప్పుడూ అలా మాట్లాడకు. దొంగ ఉత్తరాలు చూడటాన్ని సమర్థించటం కూడా చాలా నీచమైన పని. ఉత్తరా లనేవి పరువు ప్రతిష్ఠలకూ, మానాభిమానాలకూ సంబంధించినవి. నా మర్యాద మంటగలిసి పోతుంటే చూస్తూ వూరుకోమంటావా?"

సూర్యం నెమ్మదిగా అన్నాడు,—"నీ ధోరణే నీది మధూ! ఉత్తరం అంటే మామూలు ఉత్తరం అనుకుంటాంగానీ ...."

"మామూలుదే కావచ్చు. అయితే .... ?"

"నిజమే. ఎవరికి రాసినవి వాళ్ళు చదువుకోవటంలోనే అర్థం ఉంది. అది నేను కాదనటం లేదు. అంతమాత్రప్పు సభ్యత తెలినివాళ్ళతో ..."

"తెలీకపోతే తెలియజేస్తాం. చూస్తూ వూరుకోవటం నా చేతకాదు."

సూర్యం మాట్లాడలేదు. ఇందిర అంది—"నీ విష కాబోలు చెప్పకుండా దాచుకుంటావు."

"నువ్వు నిష్ఠూరపెట్టటమే గానీ నీ దయవల్ల దాచుకోవాలన్నా దాగలేదుగా?"

ముగ్గురూ కొంతసేపు మౌనంగా ఉండిపోయారు. మధు అన్నాడు—"ఈ విషయం నేను దాచిపెట్టాలనే ప్రయత్నించాను. కాని జరగలేదు. నే నేదో తప్పుచేశానని సిగ్గుపడి మాత్రం కాదు. ఓసారి వెనక బెంచీలోంచి ఒక స్టూడెంటు నన్ను పలకరించాడు. తగ్గట్టు జవాబుచెప్పి తల తిప్పేసరికి వాచర్ నా దగ్గర నిలబడి ఉన్నాడు. వెనక్కి తిరిగి నేనేదో అడుగుతున్నానని అపోహ పడ్డాడు కాదని చెప్పాను. నమ్మలేదు—"నీకై నువ్వు మాట్లాడటం చూశాను. లేచి నిలబడు."

నిలబడ్డాను.

"పేపరు పూర్తి కానివ్వండి."

"వీల్లేదు. బయటికి రా!"

"రాను. పేపరు పూర్తి చేసి కాని కదలను"

వాచర్‌కి కోపం వచ్చింది—"రావూ? అంత నిర్లక్ష్యంగా మాట్లాడుతున్నావేమోయ్!" వెటకారంగా అని చేతిమీద చెయ్యి వేశాడు.

"మర్యాదగా చెయ్యి తీసి మాట్లాడండి. లేకపోతే బావుండదు."

"బాగోగులు తర్వాత చూద్దాం. బయటికి వచ్చి మాట్లాడవయ్యా!" అంటూ చెయ్యి పట్టి లాగాడు. విసిరికొట్టాను. అంతే! తూలి ఎదటి



దాని ఫలితమే యివ్వాల్టి ఉత్తరం. నా పరీక్ష ఈ సంవత్సరం ఆపేశారు. నాకేం విచారంలేదు. నేను చేసింది కాలేజీ రూల్సు ప్రకారం తప్పే కావచ్చు. కాని, నా ప్రవర్తనలో విధేయత ఉందో లేదో నాకు తెలుసు. కేవలం ఈ పరీక్షని దృష్టిలో ఉంచుకొని వాచర్ చేస్తున్న అవమానాన్ని సహించటం నాకు చేతగాని పని—ఈ ఉత్తరం వస్తుందని నాకు తెలుసు. ఇది ఎవరికీ తెలీకుండా ఉంచాలని ప్రయత్నించాను. నేను మరో సంవత్సరం పాసవగలను కానీ పోయిన గౌరవాన్ని తెచ్చుకోలేను. నేనేదో కానిపని చేశానని—అందుకే నన్ను కాలేజీ నుంచి పంపించేశారనీ ఇప్పటికే పాక్కిపోయింది. అసలు విషయం ఎవరికీ తెలీదు. తెలుసుకోటానికి ప్రయత్నంకూడా చెయ్యరు." మధు ఆగాడు.

ఇందిర ఆశ్చర్యంగా చూసింది.

సూర్యం అన్నాడు—"ఇందుకేనా నువ్వింత బాధపడ్డావు మధూ! ఎవరి విషయం ఎలా ఉన్నా నేను నిన్ను నమ్ముతాను. చదువుకోవాలని తహతహలాడే నువ్వు ఆ చదువు విషయంలోనే నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తావని ఎప్పుడూ అనుకోను. మళ్లీ సంవత్సరం చదివి పరీక్ష రాద్దుగాని. అంతేగా?"

మధు మనస్సంతా వికలమైపోయింది. ఇందిర మధు మొహంలోకి చూస్తూ అంది—"ఎవరో ఏదో అనుకుంటారని నువ్వు జంకటం చిత్రంగా ఉంది మధూ! ఈ విషయం నువ్వు నాకు చెప్తే ఇంత జరిగేదే కాదు సుమా!"

మధు కళ్లల్లో అప్రయత్నంగా నీరు చిమ్మింది.

* * *

సుశీల జమీందారుల సంస్థానంలో చదువు పూర్తిజేసి ఇంటికి వచ్చింది. ఇందిరకు సుశీలపట్ల గౌరవమేగాక సానుభూతికూడా. నోరు విప్పి మాట్లాడలేని లోపం తప్పితే సుశీల ఆణిముత్యం! మణిపూస. విద్యాధికురాలైన సుశీల కన్నులు చురుకుగా వివిధానుభూతులతో మెరుస్తుంటాయి. చిరునవ్వులు చిందే సుశీల వదనం కళాకాంతులకు ఆటపట్టుగా గోచరిస్తుంది. ధృఢంగా ఆరోగ్యంగా పెరిగిన సుశీల దేహం నిండుతనం పొందుపరుచుకుంది. సన్నని తెల్లని చీరలు కట్టే సుశీల— కళ్లతో సరిగమలన్నీ పలికించే సుశీల— నిశ్శబ్దంగా చిరునవ్వు చిందించే సుశీల— పుట్టింట ఆడబిడ్డ గర్వంతో తిరిగే సుశీలకు— సుశీలకు సుశీలే సాటి అనిపించే సుశీల అన్నలిద్దరికీ ముద్దు చెల్లెలు!

సుశీలకు పుస్తకాభిమానం ఎక్కువ. ఎప్పుడూ చదువుకుంటూనే కన్పిస్తుంది. అత్యవసరమైన పరిస్థితుల్లో వదినకు సాయంచేస్తుంది. వదినె దగ్గిర వంట నేర్చుకుంటుంది. రకరకాల కుట్లూ అల్లికలూ వదినెకు నేర్పుతూంది. మేనల్లుడు విజయ్ విషయాలన్నీ సుశీలే చూసుకుంటుంది. నిశ్శబ్దంగా ఉండే సుశీలతో మాట్లాడటం— కంటే చూపులద్వారా సుశీల అభిప్రాయాలు అందుకోవటం ఇందిరకు వేడుక. ఒకసారి సుశీల కన్నుల్లోకి

# అజీర్ణము వల్ల ఎందుకు బాధ పడతారు?

# హ్యూలెట్స్ మిక్స్చర్

## వాడి త్వరగా నివారణను పొందండి

ఎడతెరిపిలేని పని మరియు చింత జీర్ణశక్తిని చెడగొట్టి ఆకలిని పోగొట్టి మందకొడితనాన్ని కలిగిస్తాయి. హ్యూలెట్స్ మిక్స్చర్ అతిత్వరగా చిర నివారణను కలిగించును. కడుపులో ఇది రక్షణపూతగా ఏర్పడుతుంది. బాధ కలిగించే ఆమ్ల రసములను సరిపరచి తిన్న ఆహారము జీర్ణించుటకు ఉపకరించును. హూలెట్స్ మిక్స్చర్ చంటిపిల్లల జీర్ణాశయ రోగములకు కూడా మంచిది. విరేచనములకు నల్లమందు కలిసిన హూలెట్స్ మిక్స్ర్‌ను వాడండి.

**హ్యూలెట్స్ మిక్స్చర్ జీర్ణశక్తికి ఉపకరించును.**




C. J. హ్యూలెట్ & సన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్, 86/A తియ్యనియప్ప నాయక్ స్ట్రీటు, మద్రాసు-3

JWT/CJH/2823

మేము ఎగుమతి చేయు దేశాలు-5

# పశ్చిమ జర్మనీ 1963 సం॥ లో 1,00,000 జతల జోళ్లను బాటా ఇండియానుండి కొన్నది

*Bata*



# కూలిన గోడలు

చూస్తూ అంది ఇందిర— "నువ్వేమీ అనుకోకపోతే ఒకటి అడుగుతాను సుశీలా!"

"ఏమిటి?" చూసింది సుశీల.

"ఇలా మౌనంగా ఉండాలంటే నీకు బాధగా లేదూ. అందరిలా గలగలా మాట్లాడాలని అనిపించటంలేదూ?"

నవ్వింది సుశీల— "పిచ్చి ప్రశ్న!" అన్నట్టు. నిజమే, పిచ్చి ప్రశ్నకదూ? అంత సహజమైన కోరిక ఎందుకు ఉండదు.?

సుశీల పూసలవంటి అక్షరాలతో కాయితంమీద రాసింది— 'నా ఈ అవగుణాన్ని భగవంతుడు ప్రసాదించిన వరంగానే భావిస్తున్నాను. వదినా! ఇప్పుడు నా సుఖానికిగానీ సంతోషానికిగానీ ఏం లోపం వచ్చింది?"

ఇందిర సంభ్రమంగా చూసింది—"నీవంటి వారికి కావలసింది సంతృప్తి ఆత్మవిశ్వాసమే సుశీలా! అవి నీకు బాగా ఒంటబట్టాయి."

"చూడు వదినా! నాకే ఈ మూగతనం లేకపోతే పరిస్థితులు మరోలా ఉండేవి."

"అదెలా?"

"కాదా మరి? నేను అందరిలా మాటాడుతూ మామూలులుగా ఉంటే సంస్థానానికి ఎందుకు వెళ్తాను? ఈ విద్య ఎలా అబ్బుతుంది? అత్తల అడుగులకి మడుగులొత్తుతూ బ్రతకాల్సి వచ్చేది. అన్నయ్యని హైస్కూలులో చేర్పటానికే నానాఅల్లరీ చేసినవాళ్ళు నా చదువుమాట పట్టించుకోనైనా పట్టించుకుంటారా? ఆ హీనమైన బ్రతుకుకన్నా ఇలా మూగగా వివేకపూరితంగా ఉండటమే నాకు సంతోషంగా ఉంది వదినా!"

"అబ్బా! చాలా గడుసుదానివే! అయితే అమ్మాయిగారూ! ఇలా వెర్రి వెర్రిగా చూస్తూ మాటామంచీ లేకుండా కూర్చుంటే నిన్నెవడు పెళ్ళిచేసుకుంటాడేమిటి?" ఇందిర హాస్యంగా చేసింది.

"నీ తాత." నవ్వింది సుశీల— "నాలో లోపం ఎరిగి సంతోషంగా అంగీకరించే వ్యక్తి ఎవరైనా నాకు ఇష్టమే. అలా కానివాడైనా స్వతంత్రంగా బ్రతకగల శక్తి నాకుంది. అమ్మగారిచ్చిన మిషనే నా మొగుడనుకో. నన్ను ధీమాగా పోషిస్తుంది—"

ఇందిర పకా పకా నవ్వింది— "ఎంత చిలిపిదానివి తల్లీ! నువ్వు మూగదానివేంకాదు. నోరున్న వాళ్ళుమాత్రం నీకన్నా ఎక్కువేం మాట్లాడగలరు." అంది బుగ్గలు నొక్కుకుంటూ.

ఆ సంభాషణల్లో మధుకూడా కలిస్తే మరీ సరదాగా గడుస్తుంది. ఇందిర పనులు చేసుకుంటున్నా సుశీలతో మధు గంటల తరబడీ మాట్లాడుతూ కూర్చుంటాడు. వాదనలో మధుని కూడా అధిగమించిపోతుంది సుశీల— సుశీల ఆలోచన పటిష్ఠమైనది. సున్నితమైనది. సర్వసామాన్యమైనది.

సుందరమ్మగారు, సూర్యం సుశీలకు పెళ్లి ప్రయత్నాలు కొనసాగిస్తోంటే ఓ సారి ఇందిర నవ్వుతూ అంది— "మీ చెల్లాయికి వేరే పెళ్లెందుకు? శ్యామసుందరీదేవి ఇచ్చిన కుట్టుమిషనే ఆవిడ భర్తగారట— దర్జాగా పోషిస్తుందట—




ఒక తెలుగు రచయిత్రి నవల
ఆధారంగా నిర్మించిన తెలుగు చిత్రం




ఆంధ్రుల అభిమాన సంస్థ ఎంతో
ధైర్యసాహసాలతో నిర్మించిన చిత్రం



ఆంధ్ర ప్రేక్షకులను
అపరిమితంగా ఆకర్షిస్తున్న
మహోజ్వల సాంఘిక
తెలుగు చిత్రం





ఆంధ్ర రాజధాని హైదరాబాదు
శ్రీ సారథీ స్టుడియోస్ లో
నిర్మించిన తెలుగు చిత్రం

అన్నపూర్ణా వారి

# డాక్టర్ చక్రవర్తి

నిర్మాత డి.మధుసూదనరావు B.A. దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు





ప్రముఖ నటీనటులు నటించిన
తెలుగు చిత్రం

సంగీతం. ఎస్. రాజేశ్వరరావు

సమయముగ విడుదల

సుశీలే అందికదా''? సూర్యం నవ్వాడు— "సీతాంటి మొహాలకి ఇంకెలా చెప్తుంది?''

ఉన్నట్టుండి ఇందిర ఓ సలహా ఇచ్చింది. ''మధుకి సుధనెలాగూ చేసుకుంటాం. కృష్ణి డికి సుశీలని చేసుకోమని షరతు పెట్టకూడదూ?''

''చాల్లే! వూరుకో నోరువాయీ లేనిదాన్ని ఆ వెధవకిచ్చి చేసేకన్నా నూతిలో తోసెయ్యరాదూ నీ కంత భారంగా ఉంటే?'' సూర్యం మాట లకు ఇందిర తెల్లబోయింది— ''సుశీలా నాకు భారం? నా చెల్లెలుకన్నా ఎక్కువగా భావిస్తు న్నాను. మీకు తెలుసోలేదో!'' అంది విసురుగా.

సుందరమ్మగారు ఇద్దర్నీ శాంతపర్చింది—''కిష్టి గాడి మాట ఇక వదిలెయ్యండి. ఎవరి కెక్కడ రాసి పెట్టి ఉంటే అక్కడ జరుగుతుంది.''

భాస్కరం—ఇందిర అన్న—చెల్లెలి యింటికి చుట్టం చూపుగా వచ్చాడు. స్కూలుఫైనల్ పాసై పై చదువులకు శక్తిలేక గుమాస్తా ఉద్యోగం చేస్తూ ప్రయివేటుగా పరీక్షలకు చదువు తున్నాడు. తెల్లగా, పొడుగ్గా, దృఢంగా ఉండే భాస్కరం రూపంలో కూడా చెప్పుకోదగ్గవాడే. తెల్లని పైజమాలూ, లాల్చీలూ ధరించే భాస్కరం చాల నిరాడంబరంగా కన్పిస్తాడు. భాస్కరం అంద చందాలలో విపరీతమైన ఆకర్షణ కూడగట్టు కున్నది అతని నొక్కులజుట్టు.

చలాకీగా అందర్నీ కలవేస్తూ ఇంట్లో తిరుగుతూన్న భాస్కరాన్ని పరిశీలించకుండా ఉండ లేకపోయింది సుశీల. నిశ్శబ్దంగా అతని కదలికలు చూడటం అతని మాటల వినటం కుతూహలం కల్గించాయి సుశీలకు. ఒకసారి రహస్యంగా హాస్య భావంతో అంది ఇందిరతో—''వదినా! మీ అన్నయ్య భావకవిలా ఉన్నాడు కదూ? కొంపదీసి కథ లవీ రాస్తాడా ఏమిటి?''

ఇందిర ఫక్కుమని నవ్వి చేతిలో చీటీ ''ఒరేయ్! అన్నయ్యా! ఇది చూడరా!'' అంటూ అన్నగారి మీదికి గిరవాటు పెట్టింది. సుశీల తత్తరపడి గదిలోకి పరిగెత్తి తలుపులు బిగించుకొంది— భాస్కరం ఇందిర దగ్గరికి వస్తూ అన్నాడు—

''మరి నువ్వేం చెప్పావు?''

''ఏదీ? నాకు నవ్వటంతోనే సరిపోయింది. ఆవిడ కాస్తా గదిలో దూరింది.''

''తెలివైందే ననుకుంటాను.''

''అపారమైన తెలివితేటలు. చాలా గడుసుది.'' ఇందిరా భాస్కరం చాలాసేపు సుశీల గురించే మాట్లాడుకున్నారు.

(సశేషం)

''పోయినవారం స్వేచ్ఛాభారత్‌లో స్త్రీ— సమాజంలో ఆమె ప్రతిపత్తి'' అనే వ్యాసం వేశాము. ''శ్యామసుందరి''గారు వ్రాసిన రెండవ వ్యాసం ''అమెరికాలో విదుషీ మణులు'' స్థలాభావంచేత పై వారానికి వాయిదా వేస్తున్నాము. పఠితలు యిది గమనించ ప్రార్థన. సం॥





## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన.

సం॥

## హైదరాబాద్ మూవీస్ ప్రొడక్షన్ నెం. 5.

"ఎక్కడికి వెళ్లావే?"

"కమల దగ్గరకు పెద్దమ్మా!"

"ఈడొచ్చిన పిల్లవి.......... అట్లా కోరోళ్ల వెంబడి తిరగటానికి సిగ్గెట్లా లేదంట....... ఏకేం? ... అసలు విస్తవజనిక ఏనేముందిలే కన్న వాళ్లకుండాలి ఆ బుద్ధి! ఆహాఁ! ఎంత నిశ్చింతగా భోంచేస్తున్నావయ్యా! ఆ మెతుకులు ఎట్లా మింగుడు పడుతున్నాయో నాకు తెలియదు నాయనా! ఈడొచ్చిన పిల్లలు ఇద్దరున్నారే వాళ్ల గొంతుకడ్డం పడటంలా!....... ఆడపిల్లల్ని కమంగానేసరా! వాళ్లని ఒక ఇంటి వాళ్లనిచేసి అవతలకి పంపాలన్న జ్ఞానంలేదూ! ఒకరు చెప్పాలా! రేపేదో కొంపమీదికి ముంచుకొచ్చినప్పుడు ఆదో దిబ్బో మంటే ఎవరికి జారి!"

"నాన్నా! నాన్నా! భోంచెయ్యండి నాన్నా!"

"ఛీ! అసలు ఏ ముహూర్తానగాదూ ఇదంత! కొంపకి శనిలాగ దాపరించావు!"

## మద్రాస్ సినిమా వార్తలు

"ఆ పిల్లనంటే ఏంలాభం! మనకుండాలిగాని ఆ బుద్ధి!"

"అక్కయ్యా! ఇప్పుడెందుకా మాటలన్నీ!"

"కన్నవాళ్లకే లేనప్పుడు, నా కెందుకీ కంఠశోష!"

"రండి! భోంచేద్దురుగాని!"

"నా కక్కర్లేదు. మీరు భోంచెయ్యండి!"

"అక్కయ్య మాటలకేంలెండి! ఆమె సంగతి మనకు తెలియందేముంది!"

"ఎందుకామెమీద పడతావే! ఆమె అన్నదాంట్లో తప్పేముంది? నిష్ఠూరంగానైనా నిజమే చెప్పింది! జానకి పెళ్లిచెయ్యాలి.........అందుకు ఈ ఇల్లు అమ్మాలి! ఆ తరువాత అందరం అడుక్కు తినాలి! ఇంత జనలిసినదే ........అంతే!.. ఖర్మ! చేసుకున్న ఖర్మ!"

"అక్కా! రా అక్కా! భోంచేద్దాం!"

"నాకు వద్దు............"

"అక్కా............"

"మా కళ్లముందే వస్తులు పడి చావండి! మమ్మల్నింకా కాల్చుకు తినండి!"

"అమ్మా! అలా అనకమ్మా! నాకు నిజంగా ఒంట్లో బాగోలేదు. నేను అన్నం తినలేను. రాధా! వెళ్లమ్మా! అమ్మకీ, కృష్ణుడికి అన్నంపెట్టి, నువ్వుకూడ కొంచెం తిను.......నాన్న ఎక్కడనే ఉన్నారు. ఇదంతా వినకూడదు."

ఈ సన్నివేశం హైదరాబాద్ మూవీస్‌వారు నిర్మిస్తున్న తాజా సాంఘిక చిత్రంలోనిది. నిరుపమాదేవి వ్రాసిన "అన్నపూర్ణమందిరం" కథాధారంగా ఈ చిత్రాన్ని ఇదివరకు తొమ్మిది రీళ్లు నిర్మించారు. కే. కే. కన్నాంబ మృతి తర్వాత ఆమె మరణం కారణంగా ఇంతకాలం చిత్ర నిర్మాణం ఆపివేయబడింది. కన్నాంబ ఆఖరిచిత్రం ఇదే అని చెప్పాలి. ఈ చిత్రాన్ని తిరిగి ప్రారంభించారు. త్వరలోనే పూర్తిచేసి అక్టోబరులో విడుదల చేయాలని నిర్మాతకు ఆశయం ఉన్నట్లు తెలుస్తుంది.

పై సన్నివేశంలో, అది రామశేషయ్య ఇల్లు. అతని భార్య తులశమ్మ. ఆమె తోడికోడలు దుర్గమ్మ ఉంటారు. రామశేషయ్యకు ఇద్దరు ఆడపిల్లలు. జానకి, రాధా, ఒక కొడుకు కృష్ణుడుకూడా ఉన్నాడు. ఈడొచ్చిన పిల్ల జానకి వివాహ సమస్య చిత్రీకరణ జరిగింది. రామశేషయ్యగా గుమ్మడి, తులశమ్మగా హేమలత, దుర్గమ్మగా లక్ష్మీకాంతమ్మ, జానకిగా జమున, రాధగా వాసంతి, కృష్ణుడుగా మాస్టరు రాబు పాల్గొన్నారు. వీరుగాక ఇంకా ఈ చిత్రంలో అల్లయ్య, రమణారెడ్డి, సూర్యకాంతం, కన్నాంబ, చలం, గీతాంజలి, చంద్రశేఖర్, రాజబాబు మొదలగు వారు నటించారు.

ఈ చిత్రానికి మాటలు— డి.వి.నరసరాజు, పాటలు— ఆత్రేయ, ఆరుద్ర, కొసరాజు రాఘవయ్యచౌదరి, సి. నారాయణరెడ్డి, సంగీతం — కోదండపాణి, ఛాయ—జె.సత్యనారాయణ, నృత్యం—పసుమర్తి కృష్ణమూర్తి, శబ్దగ్రహణం—ఎ. కృష్ణన్, కళ—వాలి, ఎడిటింగ్—ఎస్.పి.ఎస్.వీరప్ప, మేకప్—మంగయ్య, స్టూడియో—విజయ అండ్ వాహిని, స్క్రీన్‌ప్లే — కె. ఎస్. ప్రకాశరావు, అసోసియేట్ డైరెక్టరు—పి.సాంబశివరావు, దర్శకుడు— సి.ఎస్.రావు, నిర్మాత—పి. గంగాధరరావు.

## "పల్నాటి యుద్ధం" రికార్డింగ్

అనురూపావారు తమ ద్వితీయ చిత్రం "పల్నాటియుద్ధం" అనే చారిత్రాత్మక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈ చిత్రానికి సంబంధించిన ఒక పాటను ఈ మధ్య భరణీ స్టూడియోలో రికార్డు చేశారు.

"జయ శంభో శివశంకరా........

జగదీశా స్వయంభో ప్రభో—"

పై పాటను సముద్రాల రాఘవాచార్యులు వ్రాశారు. పి.భానుమతి పాడింది. పై చిత్రంలో నాయకురాలు నాగమ్మగా శ్రీమతి భానుమతితో పై పాటను చిత్రీకరిస్తారు. సంగీతం—ఎస్.రాజేశ్వరరావు.



"బభ్రువాహన" లో రాజసులోచన

## గోకుల్ ఆర్టు థియేటర్సువారి సాంఘిక చిత్రం

గోకుల్ ఆర్టు థియేటర్సువారు మరాఠీ కథ ఆధారంగా సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు ఈ మధ్య ఈ చిత్రం షూటింగ్ ఫిలిం సెంటర్‌లో ప్రారంభించారు. మొదటి సెట్‌లో సావిత్రి, నాగయ్య, చలం, నాగభూషణం, సీతారామయ్య, రాధాకుమారి, మాస్టర్ రవి పాల్గొన్నారు. ఇప్పటికి 2 రీళ్ళ చిత్రం పూర్తి అయింది.

పిదపగా ఇంకా ఈ చిత్రంలో ఎస్.వి.రంగారావు, కృష్ణకుమారి, రేలంగి, గిరిజ, చంద్రకళ, హేమలత మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి రచన— సౌర్తిమూర్తి శివరామ కృష్ణ, సంగీతం—టి.వి.రాజు, ఛాయ— రామచంద్ర, కళ— కె. నాగేశ్వరరావు, కూర్పు— జి.డి.జోషి, సహాయ దర్శకులు — శ్రీనివాసరావు, ధన కోటేశ్వరరావు, ఇంతవరకు ఒక కామెడీ పాటను ఈ చిత్రానికి రాజశ్రీ వ్రాసినట్లు తెలుస్తుంది. దర్శకత్వం—బి.ఎస్.నారాయణ, నిర్మాత—దోనేపూడి కృష్ణమూర్తి.

## "చలాకీ పిల్ల"

పి. సుబ్రహ్మణ్యం సమర్పించు "చలాకీపిల్ల" తెలుగు చిత్రం పూర్తి అయింది. ఈ చిత్రంలో పండరీబాయి, రాగిణి, ఎం.ఎన్.రాజం, ముత్తులక్ష్మి, హెలెన్, బేబి ఉమ, శ్రీరాం, టి.ఆర్.రామచంద్రన్, తంగవేలు మొదలగువారు నటించారు. ఈ చిత్రానికి మాటలు— పాటలు— అనిసెట్టి. ఈ చిత్రాన్ని ఈ నెలలోనే ఆంధ్రలో ఫిలిమ్ అండ్ ఫిలిమ్స్‌వారు, సీడెడ్‌లో ఇందిరా ఫిలింస్‌వారు, నైజాంలో ఉదయశ్రీ వారు విడుదలచేయనున్నారు.

## "బభ్రువాహన"

సాధువు వేషంలో ద్వారకలో ప్రవేశించిన అర్జునుని ధైర్యాన్ని పరీక్షచేయుటానికి ఒకనాడు కృష్ణుడు రుక్మిణి రూపంలో అతిథి గృహానికివచ్చి అర్జునుని బెదరిస్తాడు. అర్జునునివెంట నారదు ఉంటాడు.

"గురూ! గురూ! వస్తున్నారు! వస్తున్నారు!"

"రానీ! రానీ! మేం సిద్ధంగానే ఉన్నాం"

"వారు కాదయ్యా?"

"మరి ఎవరయ్యా?"

ఇంతలో రుక్మిణి కోపంగా ప్రవేశిస్తుంది.

"నారాయణ! నారాయణ!"

"నారాయణకాదు, నక్క తోకకాదు కపట సన్యాసి. మహానుభావుడనుకున్నందుకు మంచిపనే చేశావు!"

"నారాయణ! నేనేం చేశాను?"

"ఏం చెయ్యకపోతే మా సుభద్ర ఆ సన్యాసి సేవకు పోనని ఎందుకంటుంది?"

"అది ఆమె మనసుకే తెలియాలి!"

"ఆ మనసు నీకు తెలియదా? సపర్యలకై వచ్చిన పిల్లతో సరసాలాడుతావా? ఏకాంతంచూచి చేయి పట్టుకుంటావా? ఇందుకేనా ఈ సన్యాసం? ఇదేనా నీ సంస్కారం?"

"నారాయణ! ఆ కన్య మనోనిశ్చయాన్ని పరీక్షించడానికేకాని మాకే దురుద్దేశ్యమూ లేదు......"



"బభ్రువాహన"లో చలం, రాజసులోచన

"ఆహా! అక్రమాలు కప్పిపుచ్చడానికి అబద్ధాలు కూడానా? నీ ముఖం చూడగానే నీ నిజస్వరూపం తెలుస్తుంది. మా అమ్మాయిని అపహరించడానికే మాయ వేషంతో మా నగరంచేరి నాటక మాడుతున్నావు. మా బావగారికి చెప్పి నీ బండారం బయట పెడతాను."

"అంతపని మాత్రం చెయ్యకు రుక్మిణీదేవి! వెళ్ళనిస్తే ఇలాగే వెళ్ళిపోతాను. నీకు పుణ్యముంటుంది."

అర్జునుడు ప్రార్థిస్తూ ఉండగా రుక్మిణి కృష్ణుడుగా మారుతుంది.

"ఏదో ధైర్యవంతుడవనుకున్నాను. ఇంతేనా బావా? కార్యసాధనకు ఓర్పూ, నేర్పూ ఉండాలి! రసభంగమైతే ముఖభంగమవుతుంది. జాగ్రత్త!"

"అలాగే బావా!......నారాయణ! నారాయణ"

ఈ సన్నివేశం ఎస్.ఎ.పి. వారి "బభ్రువాహన" చిత్రంలోనిది. అర్జునుడుగా ఎన్.టి.రామారావు,



"మంచిమనిషి"లో రామారావు, జమున, జగ్గయ్య.

# సినిమా వార్తలు

లక్ష్మిగా జయంతి, కృష్ణుడుగా కాంతారావు పాల్గొన్నారు.

ఈ చిత్రానికి మాటలు— పాటలు, దర్శకత్వం కొమ్మూరి శాంభవాచార్య, ఛాయ— కమల్ ఘోష్, నిర్మాత— సి. జగన్మోహనరావు.

## దర్శకుడు ప్రత్యగాత్మ స్వంత సంస్థ

యువ దర్శకుడు శ్రీ కె. ప్రత్యగాత్మ "ఆత్మ ఆర్ట్స్" అనే పేరుతో చిత్రాల నిర్మాణానికి స్వంత సంస్థ నొకదానిని ఏర్పరచుకున్నారు. బాపూజీ ఆరాధించిన మర్కటత్రయం ఈ సంస్థకు చిహ్నం. స్క్రిప్టు వర్కు పూర్తి అయిందని, త్వరలో సెట్సు మీదకు వెళ్తారని తెలుస్తున్నది.

## 'వీరాభిమన్యు' పాటల రికార్డింగ్

రాజలక్ష్మీవారు నిర్మిస్తున్న పౌరాణిక చిత్రం "వీరాభిమన్యు" కు ఆరుద్ర, దాశరథి, వాస్త చిరంజీవి, సముద్రాల రామానుజాచార్య వ్రాసిన నాలుగు పాటలను సంగీత దర్శకుడు కె. వి. మహదేవన్ సంగీత బాణీని సమకూర్చగా రికార్డు చేయబడినవి. వీటిని ఉత్తర—అభిమన్యు (నూతన నటి కాంచన—శోభన్‌బాబు) లతో చిత్రీకరిస్తారు. ఈ చిత్రానికి దర్శకుడు—వి. మధుసూదనరావు, నిర్మాతలు—సుందర్‌లాల్ నహాతా అండ్ డూండీ.

## సుగంధివారి "గ్రామదేవతలు"

హైదరాబాద్ శ్రీ సారథి స్టూడియోలో సుగంధి వారి "గ్రామదేవతలు" చిత్రం షూటింగ్ తిరిగి ప్రారంభమైంది. ఈ చిత్రంలో జగ్గయ్య, చలం, ధూళిపాళ, రాజబాబు, రాజసులోచన మొదలగు వారు నటిస్తున్నారు. వీరు గాక ఇంకా ప్రధాన పాత్రధారిణి ఉషాకుమారి అను నూతన నటి నటిస్తున్నది. ఈ చిత్రానికి రచన : పాలగుమ్మి పద్మరాజు, సంగీతం : పెండ్యాల నాగేశ్వరరావు, దర్శకుడు : సి. ఎస్. రావు.

సి. ధర్మారావు. ★



"అగ్గిపిడుగు"లో రాజశ్రీ

# అవీ - ఇవీ - అన్నీ

## జర్మనీనుంచి కొత్త ఫిల్ము

జర్మనీలో తయారయే 'ఆర్. వో' ముడి ఫిల్మును, రంగు ఫిల్మును భారతదేశానికి విరివిగా విడుదలచేసే సందర్భంలో ఇటీవలనే ఎ. వి. ఎం. స్టూడియోలో సభ జరిగింది.

ఇండియాలోని నిర్మాతలు ఎదుర్కొంటున్న 'ముడి ఫిలిం కొరత' పరిస్థితి దృష్ట్యా ఈ 'ఆర్. వో' ఫిలిము దిగుమతి చేయటం జరుగుతోంది. ఈ చర్య ద్వారా 'ముడిఫిల్ము' సమస్య కొంత పరిష్కరించబడే అవకాశం ఉంది.

ఈ సభలో ఎ. వి. ఎం. స్టూడియో తరఫున శ్రీ మెయ్యప్పన్ స్వాగతం చెపుతూ, భారతదేశంలోని నిర్మాతలు 'ముడిఫిల్ము' దొరకనందున ఎదుర్కొంటున్న సాధక బాధకాలను వివరించారు. కొత్తగా విడుదల అయే 'ఆర్. వో' ఫిలిం మంచి ఫలితాలనే ఇస్తున్నదని చెపుతూ, ఈ ఫిలిము రంగులలో కూడా దొరుకుతుందన్నారు. ఈనాడు దాదాపు తొంభై తొమ్మిది వంతులు ముడిఫిల్మును దిగుమతి చేసుకోవటం జరుగుతుందని, ముఖ్యంగా విదేశి మారకద్రవ్యం దొరకనందున ఈ ముడి ఫిలిమ్ సమస్య ఎక్కువవుతున్నదని, కొత్తగా విడుదలయిన 'ఆర్. వో' ఫిలిం ఈ సమస్యలను పరిష్కరించగలదని ఆయన అన్నారు.

జర్మనీ వ్యాపార ప్రతినిధి డాక్టర్ ఫాల్టర్ శ్రీమతి ఫాల్టర్లు కూడా ఈ సభకు హాజరయినారు.

'ఆర్. వో' ఫిలిం యొక్క ప్రాముఖ్యత, దీన్ని జర్మనీ నుంచి ఇండియాకు విడుదల చేయుటంలో గల ఆశయాన్ని, డాక్టర్ ఫాల్టర్ తన ఉపన్యాసంలో ప్రస్తావించారు.

సభ అనంతరం 'ఆర్. వో' ఫిలింతో తీసిన కొన్ని దృశ్యాలను నిర్మాతలకు, ఇతర ప్రముఖులకు ఎ. వి. ఎం. స్టూడియోలో చూపారు.

## మూడు ప్రసిద్ధ నాటకాలు

మద్రాసు సౌందర్య కళామందిర్ ఆధ్వర్యాన స్థానిక మ్యూజిక్ అకాడమీ హాలులో మూడు రోజుల పాటు ప్రదర్శించబడిన మూడు ప్రసిద్ధ తెలుగు నాటకాలు—కురుక్షేత్రం, గయోపాఖ్యానం, చింతామణి—ప్రదర్శనలు ఇక్కడి తెలుగువారిని విశేషంగా ఆకర్షించాయి. మూడు నాటకాల్లోనూ పాల్గొన్న వారిలో కొందరు సుప్రసిద్ధులయిన స్టేజి నటులు కావటం, మరికొందరికి సినిమా, నాటకరంగాలతో సన్నిహిత పరిచయం ఉండటం కూడా ఈ ప్రదర్శనల ప్రాముఖ్యతను హెచ్చించాయి.

మొదటిసారి ప్రదర్శన 'కురుక్షేత్రం'. ఈ నాటకాన్ని తెనాలికి చెందిన ఆంధ్రా ఆర్టిస్టు అసోసియేషన్‌వారు ప్రదర్శించారు. మయసభతో ప్రారంభమయి, దుర్యోధన వధతో అంతమవుతుంది. శ్రీ కృష్ణ పాత్రధారి పీసపాటి నరసింహమూర్తి మొదలు ప్రతి చిన్న పాత్రతో సహా అందరూ మంచి గాన మాధుర్యం కలవారు. ఇటీవల సినిమాలలో కూడా అధికంగా కనిపిస్తున్న శ్రీ ధూళిపాళ దుర్యోధన పాత్రను

సమర్థవంతంగా పోషించటం జరిగింది. ఈ నాటకంలో ప్రతి ఒక్కరినీ మెప్పించగలిగేవి పద్యాలు, ప్రేక్షకులు ఆశించేవి కూడా అవే. నటులందరూ సమర్థులు కావటం, అందరూ చక్కగా పాడగలిగినవారు కావటం మూలంగా నాటకం బాగా రక్తికట్టింది. ముఖ్యంగా పీసపాటివారు పాడిన పద్యాలు మళ్ళీ, మళ్ళీ వినాలనిపించాయి. ఎటొచ్చీ కొందరు పాత్రధారుల విగ్రహాలు ఆయా పాత్రలకు సరిపోలే దనిపించింది.

రెండవనాటి 'గయోపాఖ్యానం' ప్రదర్శన ఆశించిన దానికంటె బాగా ఉంది. మొదటినాటి కృష్ణుడు శ్రీ పీసపాటి ఈ నాటకంలో అర్జును డయారు. శ్రీ ఎ. వి. సుబ్బారావు శ్రీ కృష్ణ పాత్రను పోషించారు. గయుడుగా శ్రీ ధూళిపాళ నటించారు. నటులంతా బాగానే నటించారు.

మూడవనాటి 'చింతామణి' నాటక ప్రదర్శనతో నాటకాల సంరంభం ముగిసింది. మొదటి రెండు రోజులూ, 'సీరియస్' కోవకు చెందిన పౌరాణిక నాటకాలను చూచినవారికి 'చింతామణి' నాటకం కొంత 'రిలీఫ్' ను ఇచ్చింది. పీసపాటి, ధూళిపాళ గారలే ఇందులో బిల్వమంగళ, భవానీశంకరులుగా నటించారు. సుబ్బిశెట్టి పాత్రను కాళిదాసు కోటేశ్వరరావు, శ్రీహరి పాత్రను సూరవరపు వెంకటేశ్వర్లు పోషించారు.

చింతామణిగా నటించిన శ్రీమతి కళ్యాణి, చిత్రగా ఎల్. రమ పాత్రల పరిధి మేరకు చక్కగానే నటించారు. మొదటి రోజున అశ్వత్థామ పాత్ర ధరించిన బి. వి. బ్రహ్మయ్య 'చింతామణి' లో 'దామోదర' గా నటించి, 'గట్టివాడే' ననిపించారు.

వాశిరాజు ప్రకాశం. ★

# సరాగమాల

11 వ పేజీ తరువాయి

భానుమతికి ఆ చిత్రంలో మరొక పాట, కనీసం రెండు పద్యాలు ఉంటాయని ఆ చిత్రానికి దర్శకులైన రామినీడుగా రన్నారు. మరొక పాటా కూడా ఉంటే బాగుండునే అని నే ననుకున్నాను. వారు రికార్డు చేయాలనుకున్న భానుమతి రెండవ పాట మూడు వంతులు మల్లాది రామకృష్ణశాస్త్రిగారే వ్రాస్తారని నా వూహ. "సన్నజాజి పూవుల, సంపంగి తీవెల" అందం విన్నవారూ, కన్నవారూ ఎవరూ ఇంకా మరువలేదు గదా!

తమిళ చిత్రం "కర్పగం" ఇప్పుడు తెలుగులో ఆదుర్తి దర్శకత్వాన తీయబడుతున్నది. అందులో కథానాయిక పాత్ర, అతి క్లిష్టమైన పాత్ర, ప్రేక్షకుల సానుభూతి లేకుండానే రాణించవలసిన పాత్ర, అతి సౌమ్యం కనబరుస్తూ మనోస్థైర్యాన్ని చూపగల పాత్ర భానుమతి ధరిస్తున్నది.

అందులో ఒక పాట "ఎన్నో రాత్రులొస్తాయి" విన్నాను. తమిళ చిత్రంలో ఈ పాట సుశీల పాడింది. చాలా బాగా ఉంది పాట, ఇంకా బాగా ఉంది ఆమె పాడటం. అదే పాటను మొదట్లో అంటే ఆ పాత్రను ధరిస్తానని భానుమతి అంగీకరించక ముందు, తెలుగులో కూడా సుశీల చేతనే పాడించారు. వరుసలో మెళుసకువల వలనైతేనేం, పాడటంలో మరికొన్ని నగిషీలు సుశీల చూపించటం వలనైతేనేం, ఆత్రేయ రచన వలనైతేనేం, తమిళ గీతంకన్న బాగుంది. అదే పాట భానుమతితో పాడించి వది విన్నాను. అంతకుముందున్న పాటకు పది రెట్లు ఆకర్షణీయంగా ఉంది. ఈమాట అనటంలో సుశీల పాడటాన్ని చిన్నబరచే ఉద్దేశమే లేదు. చెప్ప దలచుకున్నది యిది. నటించేవాళ్ళే పాడితే, ఆ పాత్ర రచన దృష్ట్యా పాడటంలో ఎన్ని మార్పులు తేగలరో కూర్పులు చేయగలరో అని. ఇందులో సుశీల లోపం ఏమైనా ఉందంటే, అది ఆమె కంఠంలోనిది ఎంతమాత్రం కాదు. ఆమె నటి కాకపోవడమే దీనికి కారణం.

పాడి నటించేవాళ్ళకున్న సౌకర్యమే ఇది. భానుమతి, శాంతకుమారి, ఎస్. వరలక్ష్మి మొదలైనవారికి పాత్రకు తగిన విధంగా పాడే అవకాశం, పాత్ర పూర్తి స్వరూపం తెలుసును గనుక, ఎక్కువగా ఉంటుంది. నేపథ్యగాయకులకు పాట సన్నివేశం చెప్పబడుతుంది గాని పాత్ర స్వరూపంతో అంత పరిచయం ఏర్పడటానికి అంతగా అవకాశం ఉండదు. పాత్రతో అంత సాన్నిహిత్యమే నేపథ్య గాయకులకూ ఏర్పరచబడిననాడు వారూ ఈ నటీమణులకు యీడుగా ఎందుకు పాడలేరు?

ఈ తెలుగు "కర్పగ" నికి సంగీత దర్శకుడు కె. వి. మహాదేవన్. భానుమతి ఇందులో రెండు పాటలు విధిగా ఉంటాయని, ఆమె అభిమానులు కలలు పండితే మరొక పాటా ఉండవచ్చునని అభిజ్ఞుల అంచనా.

త్వరలోనే భానుమతి తనకు అన్నివిధాలా తగిన మరొక పాత్రను చేపట్టవచ్చునని తెలుస్తున్నది. నాకు తెలిసిన మరునటివారమే సరాగమాల పాఠకులకు తెలియటం తథ్యంకదా! ★

## కార్యసిద్ధి

27 వ పేజీ తరువాయి

తెలగాని ఆ గణపతి అనగా వాకేపాటి ?—

"అనుజ్ఞ యిప్పించండి. ఒక్కరోజు గడువు ఇప్పించండి. అంతే !—ఆ పసివాణ్ని పట్టి కట్టి తెచ్చి ప్రభువుల ఎదట పెట్టినప్పుడు ఏలికకే అంతులేని ఆశ్చర్యం కలుగుతుంది. ఈ పని చేయ లేకపోయినట్టయితే, నా తలకొట్టించి కోటగుమ్మానికి వేళాడదీయించండి!'' అంటూ ధీమాగా పలికాడు.

అందుకు సింధురాజు, "సరె నీ చాకచక్యమంతా వినియోగించి ఆ పిల్లవాణ్ని పట్టి ప్రాణాలతో తీసుకు రావొద్దాం. అయితే ఆ గణపతి సామాన్యుడను కుంటున్నావేమో, కాదు. మన రాక్షస వీరులు ఎందరెందరినో అతడు నామరూపాలు లేకుండా చేశాడు. ఇంతవరకు అతన్ని హతమారుస్తానని పోయినవాళ్లలో ఒక్కడూ తిరిగిరాలేదు. కనుక, ఇదేమంత సులువైన పనికాదని మాత్రం తెలుసుకో.

"నువ్వింతగా చెబుతున్నావు గనక, ఆ కుర్ర వాణ్ని నువ్వు నిజంగానే పట్టితెచ్చి మా ఎదుట పెట్టిననాడు నువ్వు కోరిన బహుమతి ఇస్తాము. ఇదే మామాట'' అని చెప్పి అభయమిచ్చాడు, సింధు రాజు.

ప్రభువు దగ్గర చంచలుడు సెలవు తీసుకుని వెళ్లిపోయాడు.

శుక్రాచార్యుడు ఆనాటికి ఇంటికి చేరుకున్నాడు.

(ఇంకా వుంది)



Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty Street Madras-1. Phone: 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.

